# నేటి జనానా





రచన

కొత్తపల్లి సుబ్బరామయ్య.





...లి గ్రంధమండలి,
మదరాసు.

# ఇందులో -



# నేటి జపాను




రచన :

కొత్తపల్లి సుబ్బరామయ్య, ఎం.ఏ., ఎల్.టి.,

8.11.43

సంస్కృతి గ్రంథమండలి
వంగల్ బిల్డింగ్స్ :: పెరంబూరు పోస్టు,
మద్రాసు.

ప్రచురణ—౩
వెల ఎనిమిదణాలు.

ప్రథమ ముద్రణం,
జూన్ 1942.

సంపాదకులు:
కస్తూరి సూర్యప్రకాశరావు.
కొత్తపల్లి సుబ్బరామయ్య. ఎం.ఏ.,ఎల్.టి.,

నా చెల్లెలు

కీ॥ శే॥ చిలకపాటి పద్మావతికి

ప్రేమతో —

# గ్రంథకర్త

జననం 1-2-1910 న, పెరంబూరులో. బాల్యం, విద్యాభ్యాసం గుంటూరుజిల్లా ఒంగోలులో. 1928-30 లో చెన్నపట్నంలో ఉద్యోగం. ఉప్పుసత్యాగ్రహమప్పుడు ఉద్యోగానికి రాజీనామానిచ్చి ఆ ఉద్యమంలో పాల్గొన్నాడు. 1931-37 లో కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చదివి ఎం. ఏ. పట్టభద్రు డయ్యాడు. 1937-38 లో అడయార్ లోని దివ్యజ్ఞాన సమాజంవారి ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయుడుగా నున్నాడు. 1938-39 లో మరల విద్యాభ్యాసం; యల్. టి. పట్టభద్రుడయ్యాడు. కొద్దిమాసాలు 'విద్యావనం', 'కార్పొరేషన్ ఉన్నత పాఠశాల', 'నవ్య భారతీ'లలో పనిచేశాడు. ఏకాకి. లోకాన్ని ఉద్ధరిద్దామని ఉబలాటపడ్తాడు. వ్యక్తిత్వం, స్వతంత్రత హెచ్చు. అందుకే ఎక్కడనూ యిమడలేకుండా వున్నాడు. ఈతని యితరరచనలు- 'సోవియట్ రష్యాలో', 'దేవు డొకడున్నాడా?'

# మా మాట.

సంస్కృతి గ్రంథమండలి కార్యక్రమాన్ని ప్రారంభించి యిప్పటికి 8 నెల లౌతూంది. ఈ కాగితపు కరువురోజుల్లో రెండుపుస్తకాలను యింత దనుక ప్రచురింపగల్గినందుకు సంతోషిస్తున్నాం. ఆంధ్రపాఠకలోకం తగిన ప్రోత్సాహాన్నిస్తే యికముందు మా ప్రచురణకార్యక్రమం ఎక్కువ త్వరితంగానూ, మేలుగానూగూడా జరుగుతుందని చెప్పగలం. ప్రచురణలలోను, విక్రయంలోను, రచనలలోను ఇంతవరకు మాకు సాయపడ్డ మిత్రులందరికీ కృతజ్ఞులం.

ప్రభుత్వం కాగితపుధరలను నిష్కర్ష చేసిందిగాని కాగితము ప్రతివారికీ దొరికేటట్లు యింతవరకూ చేయలేదు. ప్రభుత్వంక్లి తీర్మానించిన ధరలకు కాగితం దొరకడంలేదు సరేగదా యీనాడు ప్రజల్లో నాటుకొనిపోయిన యుద్ధభయంవల్ల మద్రాసువంటి నగరాల్లోని పెద్ద కాగితపువర్తకులు లేచిపోవడంగూడా సంభవించింది. అందువల్లే యీ ప్రచురణకు కొంత ఆలస్యమైంది.

జపాన్ దురాక్రమణ మనదేశమంతా కూడా వ్యాపించింది. ప్రస్తుతం జరుగుచున్న ప్రపంచయుద్ధం కారణంగా ప్రతిఒక్కరూ కొంత ప్రపంచ జ్ఞానాన్ని సంపాదిస్తున్నారు. జపాన్ వలని భయం నానాటికీ మనదేశానికి హెచ్చడంవల్ల మనం జపాన్ నుగురించి తెలుసుకోడం అవసరం. ఇప్పటికి తెనుగులో జపాన్ నుగురించి నాలుగైదు పుస్తకాలుమాత్రమే ఉన్నాయి.

(1) జపాన్ చరిత్రము—గ్రంథకర్త :—ఆదిపూడి సోమనాథరావు. 1909.

(2) జపాన్ దేశచరిత్ర— ,, క్రొత్తపల్లి సూర్యారావు. —

(3) జపాన్ దేశ సాంఘికచరిత్ర—నండూరి మూర్తిరాజు. 1911.

ఇవైనా, ఉన్నట్లు వినడమేగాని వీటిని చూచినభాగ్యమైనా లేదు మాకు. 1937లో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు వ్రాసిన 'చీనా జపాను ప్రళయము'లో జపాన్ నుగురించి కొంత వ్రాశారు. కానీ, మే మెరిగినంతవరకూ జపాన్ లోని మానవజీవితాన్నిగురించీ, జపాన్ దురాక్రమణకు మూలకారణాలనుగురించీ విశదంగా చర్చించిన పుస్తకం, నేడు జపాన్ లోనున్న సాంఘికశక్తులను వర్ణించినపుస్తకం తెనుగులో లేదు. ఈ లోటును యీ ప్రచురణ కొంతవరకు తీరుస్తుందని మా ఆశ.

పెరంబూరు,
జూన్ 4, 1942

సంపాదకులు.

# ఎందుకీ రచన ?

ఈ సంవత్సరారంభంలో ఏవో సొంతపనులమీద గుంటూరు వెళ్లాల సొచ్చింది. అప్పటికి ఒకమాసంక్రితం జపాన్, బ్రిటన్–అమెరికాలమీద యుద్ధం ప్రకటించింది. ఆ రోజుల్లో ప్రతిచోటా, ప్రతిఒక్కరూ జపాన్ను గురించే మాట్లాడుచున్నారు. మిత్రులు శ్రీ మాడభూషి వేదాంతం నరసింహాచార్లుగారు "మీ గ్రంథమండలివారు జపాన్నుగురించో పుస్తకం ప్రచురించరాదా?" అన్నారు. అప్పట్లో కూచిపూడి (గుంటూరుజిల్లా)లోని రాడికల్ డెమొక్రాటిక్ పార్టీవారీ ప్రయత్నంలో నున్నారనివిని ఊరకున్నాం. రోజులు గడిచాయిగాని వారిప్రచురణ బైట బడలేదు. మిత్రు లెవ్వరికీ తీరిక లేకపోవడంచేత నేనే యీ ప్రయత్నానికి పూనుకోవలసొచ్చింది.

జపాను నేడు చేస్తున్న దురాక్రమణ నడ్డాలని దేశనాయకులు—గాంధి, నెహ్రూగారలనుండి వైస్రాయి, జనరల్ వెవెల్ గార్లదాకా—ఉద్బోధిస్తూనే ఉన్నారు. ఈ దురాక్రమణకు కారణాలు తెలుసుకోడానికీ, ఇకముం దెన్నటికీ జపాన్‌నుండి ప్రపంచశాంతికి భంగం కలగకుండా చేయడానికీ నేటి జపాను స్థితిగతులను చక్కగా అవగాహన చేసుకొని అక్కడి సమస్యలను పరిష్కరించడం ప్రతిమానవుని బాధ్యత. అందులో భారతీయుల బాధ్యత_దగ్గరనున్న పాపానికి—హెచ్చు. ఇంతా నెలరోజుల క్రితం మన రెండు రేవుపట్టణాలపై-విశాఖపట్నం, కాకినాడ-జపాను విమానాలు బాంబులేశాసై. ఈ క్రౌర్యాన్ని ఎదుర్కొనను, జపాను జీవితాన్ని తెలుసుకొనను యీ ప్రచురణ కొంత తోడ్పడుతుందన్న ఉద్దేశంతో ఆంధ్ర పాఠకలోకాని కందించడమైంది.

ఈ రచనకు అనేక ఆంగ్లగ్రంథాలుపకరించినై. వాటిని యీపుస్తకం ఆఖర్న పేర్కొన్నాను. కానీ మద్రాసువంటి నగరంలోగూడ ఒకపుస్తకం దొరకలేదు. విజ్ఞులనేకులు దాన్నే ముఖ్యంగా_యీ రచనకు ముందుగా-చదువమన్నారు. లభింపనందున ఆ పుస్తకాన్ని చూడకుండానే 'నేటి జపాన్'ను ప్రచురించాల సొచ్చింది. తమవద్దనున్న ఆంగ్ల ఉద్గ్రంథాలనిచ్చి అడపతడప తమ సలహాలతో ప్రోత్సహించిన మిత్రులు శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు, జి. వి. కృష్ణారావుగార్ల కెంతో కృతజ్ఞుణ్ణి.

గ్రంథకర్త.

# 1. చరిత్ర

## దేశం

జపాన్ అంటే అదిఒక దేశంపేరని, ఆదేశంలో అతి చౌకవస్తువులుత్పత్తి చేయబడతవని, ఆవస్తువులు చాలాకాలం వుండేవిగావని మన పసిపిల్లకుగూడా తెలిసిన విషయం. ఆసియా ఖండానికి తూర్పున, యీ ఖండానికి షుమారు 100 మైళ్లదూరాన పసిఫిక్ మహా సముద్రంలోగల కొన్ని దీవులనే జపాన్ అని పిలుస్తున్నాం. అక్కడి నివాసులు తమ మాతృదేశాన్ని 'దైనిప్పన్', (గొప్ప జపాన్) 'దైన్యూహన్' అని పిలుస్తారు. జపాన్‌కీ పేరు చైనావాళ్లనుంచొచ్చింది. చైనా భాషలో 'జిహ' అంటే సూర్యుడని, 'పెన్' అంటే సంబంధం కలదని అర్థం. సూర్యునికి సంబంధించిన భూమిగనుక 'జిహ పెన్' అని చైనావారు పిలిచేవారు. జపాన్ ప్రజలు తమ దేశం 'ఉదయభానుని దేశం' అని పొగడుకుంటారు. తమ చక్రవర్తి యుగయుగాలుగా తమ్ము పరిపాలిస్తున్న సూర్యవంశజుల హక్కుదారుడని, ఆయన ఆజ్ఞల శిరసావహించడం తమ విద్యుక్తధర్మమని వారినమ్మిక. ఈ భూమి ఏర్పడ్డప్పటి నుంచి తమ్ము చక్రవర్తులే పరిపాలిస్తూవచ్చారని వారు సగర్వంగా చెప్పుకుంటారు.

మనదేశంలో క్షత్రియుల్లో రెండు తెగలవారున్నారు– సూర్యవంశజులు, చంద్రవంశజులు. జపాన్‌లో ప్రజలందరు ఒక్క సూర్యవంశానికి చెందినవారే. మనం సూర్యుణ్ని పురుషుడుగా పాటిస్తాం; జపాన్‌వారు సూర్యుణ్ని–అమాతె

రాను స్త్రీగా పూజిస్తున్నారు. వారికి సూర్యుడు దేవుడు కాడు-దేవతే. తామందరు ఆమె పిల్లలవడంచేత తాము దేవాంశ సంభూతులని, తమదైవత్వం ప్రపంచంలో మరియే ఇతరజాతికి లేదుగనుక తామందరికన్నా ఉత్తములని జపాన్ వారిగర్వం. ఈ మూఢవిశ్వాసం ఎక్కడలేని సత్తువనిచ్చింది జపాన్ సామ్రాజ్యవాదులకు. ఈకారణంగా కొద్దిపాటి దేశానికి గొప్ప సామ్రాజ్యాన్ని సంపాదించగల్గారు.

జపాన్‌లో పెద్ద దీవులు 4 మాత్రమే. వీటినానుకొని చిన్నదీవులనేకం ఉన్నాయి. వీటిమొత్తం సంఖ్య సుమారు 600. వీటివివరణ—

| పెద్దదీవులు | వాటి నానియుండు చిన్న దీవులసంఖ్య | విస్తీర్ణం చ॥ మై॥ |
|---|---|---|
| హాన్‌షు | 192 | 91,278 |
| షికోకు | 75 | 7,246 |
| క్యూషు | 213 | 14,719 |
| హొక్కైడో | 44 | 34,084 |
| మొత్తం జపానుదీవులు చిన్నవి | 524 | 1,47,327 |

జపానుదేశం సామ్రాజ్యం కానారంభించినతర్వాత యీ దిగువ దేశాలను జపానుతో కలుపుకుంది.

| | | |
|---|---|---|
| కొరియా | 1018 | 85,228 |
| ఫర్మోజా, పెస్కడోర్స్ | 77 | 13,890 |
| సాఖలిన్ | 2 | 13,034 |
| జపాను, సామ్రాజ్యంలోనిదీవులు | 1621 | విస్తీర్ణం 25,9,479 |
| లియోటుంగ్ ద్వీపకల్పం | 123 | 1,436 |
| | 1744 | 2,60,915 |

ఇవిగాక యింకా చిన్న దీవులు సుమారు 100 ఉన్నాయి. కానీ వాటి సముద్రతీరపు నిడివి 2 మైళ్ళకు తక్కువగనుక పై లెఖ్ఖలో వాటిని చేర్చలేదు.

జపాన్‌ను ఆసియా భూభాగంనుంచి పసిఫిక్ మహా సముద్రం వేరుచేస్తూంది. ఈ సముద్రభాగాన్ని వేరువేరు చోట్ల వేరువేరు పేర్లతో పిలుస్తారు — జపాన్ సముద్రం, బఖాటిస్సు, తూర్పుచీనా సముద్రం. జపాన్ పొడవు షుమారు 3,000 మైళ్లు. కానీ వెడల్పెచ్చట 120 మైళ్లకు మించదు. జపాన్ విస్తీర్ణం 1,48,800 చదరపు మైళ్లు. జనాభా 7,30,00,000. జపాన్‌కుచెందిన సామ్రాజ్యంలో ప్రస్తుతం కొరియా, ఫర్మోజా, దక్షిణ సాఖలీన్, లియోంటూంగ్ మొదలైన దేశాలున్నాయి. ఈ సామ్రాజ్య విస్తీర్ణం 1,14,600 చదరపు మైళ్లు. ఇందులోని జనాభా 3,00,00,000 లకు పైగా నుంది.

ప్రస్తుతం జపాన్‌ను పరిపాలిస్తున్న చక్రవర్తి హిరొహిటొ. ఈ రాచకుటుంబం అనాదిగా అధికారంలోనున్నది. 1868 వరకు జపాన్‌నుగురించి ప్రపంచం అట్టే ఎరుగదు. గడచిన 74 ఏండ్లలో జపాన్ ఆధునిక మానవలోకాన్ని ప్రవేశించడం, ఇతర దేశాలతో సంబంధ బాంధవ్యాలు కుదుర్చుకోడం సంభవించింది. ఇప్పటికీ మనలో చాలామందికి జపాన్ అంటే అగ్నిపర్వతాలు, భూకంపాలు, ఉప్పెనలు, టపాకాయలు, అగ్గిపెట్టెలు, కాగితపు గొడుగులు, పిల్లలాడుకునే చౌకరకపుబొమ్మలు మొదలైన వాటికాటపట్టయిన దేశమని అభిప్రాయం. ఇలాంటి కొన్ని కొండగుర్తులు తప్ప

జపాన్‌నుగురించి, ఆ ప్రజలనుగురించి మనం ముఖ్యవిషయాల నెరుగం. 80 ఏండ్లనాడు అనామికంగానున్న దేశం నేడు ప్రపంచంలోని గొప్ప సామ్రాజ్యాలు రెంటినీ - బ్రిటను, అమెరికా - ఒక్కపెట్టున ఎదుర్కొని కొంతవరకు హిందూ మహాసముద్రంలోని దీవులలో యీ రెండు దేశాలకు నిలువ నీడ లేకుండా చేయగల్గిందంటే యీ దేశ ప్రభావమేంటో, యీ ప్రజల స్వభావమేంటో, వీరికీ సామ్రాజ్య కాంక్షేందుకో, వీరి రక్తపిపాసకు మూలకారణాలేవో తెలుసుకోవడం అత్యావసరం.

13 వ శతాబ్దంలో ఇటలీలోని వెన్నిస్ నగరాన్నుంచి మార్కొపోలో అన్న ప్రయాణీకుడు ప్రపంచ పర్యటనానికి బయలుదేరాడు. 1280 ప్రాంతాల్లో యీతడు చైనా చేర్రాడు. అప్పట్లో చైనావారు జపాన్‌ను 'జిహ్ పెన్' అని పిలిచేవారు. పాశ్చాత్యుడవడంచేత మార్కొపోలో 'జిపాంగ్' అని ఉచ్చరించాడీపేరును. యూరప్‌కు మళ్ళీ వచ్చింతర్వాత చైనాకు తూర్పుననున్న యీ దేశాన్ని గురించి, ఇందలి ధనసంపత్తినిగూర్చి చాటాడు. ఫ్రెంచివారీ పేరును, 'జిపోన్' అని వాడనారంభించారు. ఆంగ్లేయులు దీన్నే 'జపాన్' అని ఉచ్చరిస్తున్నారు. మార్కొపోలో వర్ణన ఫలితంగా ఈ నూతన ప్రాదేశానికి సముద్రమార్గాన్ని వెళ్ళి రావాలని యూరప్‌లోని నావికులనేకులు ఉబలాటపడ్డారు. పశ్చిమదిక్కున జపాన్‌కు సముద్రమార్గాన్ని కనిపెట్టాలని ప్రయాణమైన క్రిస్టాఫర్ కొలంబన్ అమెరికాను కనిపెట్టాడు. జపాన్ పుణ్యాన్నే అమెరికా దొరికింది.

జపాన్ బ్రిటన్లకు చాలా పోలికలున్నాయి. ఇంగ్లండు చాలా చిన్నదీవైనప్పటికి ఇంత పెద్ద సామ్రాజ్యాన్ని సంపాదించగల్గడానికి కారణం దానిభౌతికస్థితే. యూరప్ ఖండాని కానుకొనుండడం, యూరప్‌తో ఏలాంటి సంబంధం లేకుండా వుండగల్గడానికి సముద్ర మడ్డముండడం, స్వతంత్ర దేశంగా నుండడం, యూరప్‌కన్నా ముందు తాను పారిశ్రామిక విప్లవాన్ని ప్రారంభించడం, కొద్దిపాటి దేశంగనుకను, అట్టే సారవంతమైన భూమికాదు గనుకను ఆంగ్లేయులు ఎక్కువ కష్టజీవులుకావడం బ్రిటిష్ సామ్రాజ్యానికి పునాదులైనై.

ఇంగ్లండులాగా జపాన్‌గూడా దీవిగడ్డే. ఇంగ్లండు యూరప్‌కు పడమరనున్నట్లు ఆసియాఖండానికి తూర్పున, ఆసియాఖండాన్నానుకొని జపానుంది. బ్రిటన్‌లాగే జపాన్ కొద్దిపాటి దేశంగనుకను, అట్టే సారవంతమైన భూమికాదు గనుకను జపాన్‌వారు హెచ్చుగాకష్టించి జీవించాలసొచ్చింది. ఇంగ్లండులాగే, ఆసియాఖండంలోని అన్ని దేశాల్లోకి జపాన్ పారిశ్రామికవిప్లవాన్ని ముందు ప్రారంభించింది. ఆంగ్లేయులకు లేని సాధకబాధకాలు కొన్ని జపాన్‌వారికున్నా—అగ్నిపర్వతాలు, గాలిదుమారాలు, సాలీనసగటున 116 భూకంపాలు— బ్రిటన్‌లాగా తామూ ప్రపంచాధిపత్యాన్ని సంపాదించాలని వారి ఉబలాటం.

90,000 చదరపుమైళ్ళ విస్తీర్ణంగల్గి, 4,50,00,000 జనాభాగల్గిన ఇంగ్లండు ప్రపంచంలో ¼ భాగాన్ని పరిపాలి

స్తూంటే, 1,48,800 చ॥ మై॥ విస్తీర్ణం, 7,30,00,000 జనాభా గల జపాన్ కై ప్రపంచాన్ని పరిపాలింపవద్దా? అని జపాన్ సామ్రాజ్యవాదుల సవాలు.

## చీకటి

జపాన్‌వారి సాంప్రదాయాలనుబట్టి వారిసామ్రాజ్యం క్రీ॥ పూ॥ 660 లో నెలకొల్పబడ్డది. ఈ సామ్రాజ్యానికి మొదటి చక్రవర్తి జిమ్ము టెన్నో యమూటోను తన ముఖ్య పట్టణంగాచేసుకొని పరిపాలించాడు. జపానుచరిత్రలోని మొదటి 1,000 ఏండ్లు అంధకారమయం. ఈ వేయేండ్ల చరిత్ర కేవిధమైన ఆధారాలు లేవు. కేవలం సాంప్రదాయసిద్ధంగా వచ్చిన మూఢనమ్మకాలనుబట్టి యీనాటిచరిత్ర ఊహింపబడుతూంది-ఉజ్జాయింపబడుతూంది.

చరిత్రకుపూర్వమే ఆసియాఖండపు తూర్పుభాగం నుంచి కొందరు, పసిఫిక్ మహాసముద్రంలోని దీవులనుంచి కొందరు జపాన్‌దీవులను దండెత్తి తమ స్థిరనివాసాల నచట ఏర్పరచుకున్నారు. తర్వాత కొరియా, చైనా, మంగోలియాలనుంచికూడా కొందరు జపాన్‌ను దండెత్తి అచ్చటి నివాసులను పర్వతప్రాంతాలకు తరిమి సమతలప్రదేశాల్లో తాము నివాసా లేర్పరచుకున్నారు. ఆదిమనివాసులకు వీరికి మొదట కొంత సంఘర్షణజరిగినా క్రమేణా వీరు ఆదిమనివాసులతో కలిసిపోయారు. తూర్పు ఆసియాఖండంలో, పరిసరపుదీవులలో నివసిస్తూ వచ్చినవారిసమ్మిళితమే జపాన్ జాతిగా పరిణమించింది.

క్రీ॥ శ॥ 7-వ శతాబ్దంవరకు జపాన్ స్వక్రమచరిత్ర ప్రారంభం కాలేదు. క్రీ॥ శ॥ 13-వ శతాబ్దారంభంవరకు శక్తి వంతమైన కేంద్రప్రభుత్వం జపానులో ఎన్నడు ఏర్పడియుండ లేదు. క్రీ॥ పూ॥ 2-వ శతాబ్దంలోనే చైనాలోని జమీందారి విధానం క్షీణింప నారంభించింది. ఈ జమీందారుల సొంత సేనలలోని యోధులు కూటికొరకు జపాన్‌దీవులకు వలస పోయారు. వారందరికి యమాటో శరణ్యమిచ్చింది. వారి సంతతివారే తర్వాత సమూరేగా పరిణమించారు.

ఇజనాగి అన్న దేవుడు, ఇజనామి అన్న దేవి—యీ యిర్వురిచే యమాటోదీవి సృష్టింపబడ్డదని, జపాన్ ప్రజలందరు వారిపిల్లలేనని, అందువల్లే తామందరూ దేవాంశ సంభూతులని జపాన్‌వారి గుడ్డినమ్మకం. మొదటి క్రీ॥ శ॥ 500 సంవత్సరాల చరిత్ర భూస్వాములు తమలోతాము పోట్లాడుకోడంతో ప్రారంభమై ముగిసింది. ఈ అంతఃకలహాలలో జయంపొంది ఆఖరుకు యమాటోతెగ నాయకుడు "చక్రవర్తి"గా అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. ఇతరతెగల నాయకులందరు యీ చక్రవర్తి ఆస్థానమంత్రులుగా మారారు. క్యోటోలో చక్రవర్తిరాజధాని ఏర్పడ్డది.

చైనా, జపాన్‌లకు క్రీ॥ పూ॥ నుంచిగూడా సంబంధముంది. చైనానుంచి క్రీ॥ శ॥ 5-వ శతాబ్దంలో జపాన్‌వారు వ్రాయనేర్చుకున్నారు. అప్పటినుంచి జపాన్‌చరిత్ర లిఖితరూపంగా నేర్పడ్డది. అప్పటివరకు కథలరూపాన, పాటల రూపాన, నోటికబుర్లమూలాన, కర్ణాకర్ణిగా వ్యాపిస్తూ వచ్చిన దేశచరిత్ర అప్పటినుంచి వ్రాతమూలంగా నేర్పడ్డది.

చైనా సంపర్క ఫలితంగా జపాన్‌లోని భూమినంతా ప్రజల పరంజేసి ఒకవిధమైన స్థానిక స్వపరిపాలనావిధానం కొత్తగా అవలంబింపబడ్డది. కొత్తగా ప్రభుత్వోద్యోగులను పరీక్షించి నియోగించ నారంభించారు. ఈ మార్పులను బట్టి చక్రవర్తి అధికారం హెచ్చుగాజొచ్చింది. ఇలా కొద్ది మార్పులుగల్గినా భూస్వాములు, జమీందార్లు తమ పాత నమ్మకాలను, తమ కుటుంబగౌరవాలను, తమ స్వలాభదృష్టిని మరచారుకారు-వదిలారుకారు. పుట్టుకనుబట్టే వ్యక్తియొక్క గొప్పదనం పరిగణింపబడాలని వీరి నమ్మకం. చట్టరీత్యా నేర్పడిన ప్రభుత్వానికి లొంగియుండడమంటే వీరికి గిట్టదు. వీరి సిద్ధాంతరీత్యా వ్యక్తులు ఏదో యొకతెగకు—ముఠాకు లోబడి యుండాలిగాని ఏ కేంద్రప్రభుత్వానికి లొంగి యుండ కూడదు.

క్రీ॥ త॥ 12-వ శతాబ్దంలో చక్రవర్తి అధికారం క్షీణించ నారంభించింది. పెద్దపెద్ద జమీందారీలు తల చూపినై. జమీందారీవిధానం ప్రారంభమైంది. అప్పట్లో పలుకుబడిగల కొన్ని తెగల నాయకులు "షోగన్" అన్న పేరునువహించి అధికారాన్ని హస్తగతంచేసుకొని చక్రవర్తిని తమ చెప్పుచేతలలో నుంచుకో మొదలెట్టారు. "షోగన్" అన్న పదానికర్థం సర్వసేనానాయకులని. క్రీ॥ త॥ 16-వ శతాబ్దాంతంవరకు యీ షోగన్లలో అంతర్యుద్ధాలు సాగుతూనే వచ్చాయి. క్రీ॥ త॥ 1603 లో యీ అంతర్యుద్ధాలన్నిటిని అంతమొందించి టొకుగవా షోగన్‌లు అధికారాన్ని వశపరచుకున్నారు. క్రీ॥ త॥ 1868 లో యమాటో చక్రవర్తి

ఉద్ధరింపబడువరకు టోకుగవా ఏకచ్ఛత్రాధిపత్యం దేశమంతటా వ్యాపించింది.

క్రీ॥ శ॥ 5-12 శతాబ్దాలలో జపాన్‌లో సక్రమమైన ప్రభుత్వవిధానం లేదు. కేంద్రప్రభుత్వం అసలేలేదని ముందు గమనించాం. ముఠాలనాయకులు తమ సొంత సైన్యాలను కల్గి తమలోతాము యుద్ధాలు చేస్తూండడం, వీరి నణచను తగినబలం చక్రవర్తికి లేకుండడం ఆనాటి రాజకీయాల్లో సహజావస్థ. ఈ తెగలనాయకులు, జమీందారులు తమ యిష్టాన్ననుసరించి చేతిపనులను, యితరవృత్తులను అభివృద్ధి పరచడమో, నాశనం చేయడమో జరుగుతుండేది. బానిసత్వం, యజమాన్నునిపట్ల బానిసతనకృతజ్ఞత తెలియజేయను యజమానుడు మరణించినప్పుడు తాను సహగమనం చేయడం, యజమానునితోగూడా ఆతనినౌకర్లను సజీవులుగా పాతిపెట్టడం మొదలైనదురాచారాలు, పరమతదూషణ ఆనాటి సంఘజీవన స్వభావాలు. మంచి-చెడ్డలన్నీకూడా దేవునిసృష్టియనే మూఢనమ్మకం, మానవుల యత్నాలన్నీకూడా అశరీరవాణి వాక్కులననుసరించి జరుపబడాలనే విశ్వాసం హెచ్చుగానుండేవి. అంతటి మూఢత్వముండబట్టే జమీందారుల దర్జా చాలా బాగా సాగింది.

ఆ రోజుల్లోని పంటలు బియ్యం, కాయధాన్యాలు, బార్లీ, చిక్కుడుకాయలు మొదలైనవి. వ్యవసాయం ఉన్నతస్థితిలోనే ఉంటూవచ్చింది. క్రీ॥ పూ॥ ఆదిమనివాసులు చెట్టుబెరడును బట్టగాధరించినా కాలానుగుణ్యంగా పట్టుతో బట్టలతయారుచేయడం నేర్చుకున్నారు. చక్రవర్తులు

చాలాకాలం జీవించి ఉండడం సంభవించింది. ప్రజలలో చక్రవర్తుల దివ్యత్వమందు నమ్మకం గల్గడానికి యిదొక ఆధారమైంది. జిమ్ముటెన్నో 127 ఏండ్లు బ్రతికాడు. క్రీ॥ త॥ 7-వ శతాబ్దాంతం వరకుగూడ యీ చక్రవర్తుల అధికారం క్యోటో, దాని పరిసర ప్రాంతంలోమాత్రమే చెలామణిఅయ్యేది. మిగత దేశమంతట జమీందారులు స్వతంత్రులై తమ యిష్టానుసారం ప్రవర్తిస్తూ ఉండేవారు. చక్రవర్తిత్వం తండ్రినుంచి కుమారునికి సంక్రమించేది.

క్రీ॥ పూ॥ 97-30 లో సుజాన్ చక్రవర్తిగా ఉండేవాడు. ఈతనికాలంలోనే ప్రప్రథమంగా జపాన్ ఆసియాఖండపు రాజకీయాల్లో కలుగజేసుకుంది. అప్పట్లో చైనా, కొరియాలకు పోట్లాటకల్గితే సుజాన్ జోక్యం పుచ్చుకున్నాడు. ఈతని కాలంలోనే వరికంటు జపాన్‌లో ప్రారంభింపబడ్డది. క్రీ॥ త॥ 645 లో జపాన్ కొరియాలకు వైషమ్య మేర్పడ్డది.

టొకుగవ షోగన్లు అధికారంలోనున్న రోజుల్లో (ఇడో యుగం 1603-1868) భూమి మొత్తం టొకుగవకుటుంబం, "డైమ్యో" అని పిలువబడు జమీందారులసొంతమైయుండేది. భూమిలో సగ భాగం రెండేరెండు కుటుంబాల-చోషు, సట్సుమ-సొమ్మైయుండేది. చక్రవర్తి పేరుకుమాత్రం చక్రవర్తేగాని అధికారమంతా టొకుగవ కుటుంబంచేతుల్లో నుండేది. చక్రవర్తి ఆస్థానం క్యోటోలో నుండేది. షోగన్లు తమ మంత్రులసహాయంతో పరిపాలన సాగించేవారు. ఆ రోజుల్లో జపాన్ ప్రజలు నాల్గుతరగతులుగా నుండేవారు-(1) షోగన్లు (సర్వసేనాధ్యక్షులు) (2) డైమ్యో (జమీందారీప్రభువులు)

(3) సమూరే (ఈ జమీందారులయోధులు, భటులు) (4) హెయ్‌నీని (సామాన్యపాటకజనం). రాజాస్థానంలోని రాజకీయవేత్తలకు, యోధులకు దేశంలో గౌరవం హెచ్చు. పని,పాటలేకుండా కూలికి—ఎవరిపక్షాన్నైనాసరే—పోట్లాడే వారిని జపాన్ భాషలో "రోనిన్" అంటారు. ప్రతి ప్రభువుకు (గొప్ప జమీందారు) సమూరే, రోనిన్ ముఠా వెంబడే ఉండేది. ఈ యోధులకు ప్రభుభక్తి హెచ్చు. తమప్రభువు కవమానంగాని, హానిగానిజరిగితే వీరు పగదీర్చుకుంటారు. విరోధి ఎంతటివాడైనాసరే వీరికి లక్ష్యంలేదు. తాము పగ తీర్చుకోలేకపోతే ఆత్మహత్య చేసుకుంటారు. ఈ ఆత్మహత్యా విధానం చాలా అమానుషంగా నుంటుంది. తమ చేతికత్తితో తమ ఉదరకోశాన్ని పొడిచి పేగులు బయటికిలాగేసి చస్తారు. దీన్నే జపాన్‌భాషలో "హారాకీరి" అంటారు. తమప్రభువు చంపబడ్డే విరోధులమీద పగతీర్చుకున్నతర్వాత తమ ప్రభు భక్తిని ప్రకటించను ఆతనితోపాటు ఆత్మహత్య చెసుకోడ మో, సహగమనమో వీరి సహజ సాహసకృత్యాలు. ఈ నాటికీ యీ పూర్వపు ప్రభుభక్తిని, ఆత్మహత్యాశక్తిని రే కెత్తించను దేశనాయనాయకులు. కీర్తిశేషులైన ప్రభువుల సమాధులకు సంవత్సరాని కొకసారి యాత్రజేస్తారు. ఈ నీతిని జపాన్ భాషలో 'బూషిడో' అంటారు.

## మోసం

విప్లవం అన్నపదానికి సాధారణంగా మార్పని-అందున గొప్పమార్పని అర్థం. ఈ మార్పు కేవలం రాజకీయం

మాత్రమేగాదు. రాజకీయం, సాంఘికం, ఆర్థికం, నైతికం, పారిశ్రామికం మొదలుగాగల మార్పులన్నీ ఒక్కమారే కల్గవచ్చు. విప్లవం, 1917 అక్టోబరులో రష్యాలో జరిగినట్లు సాయుధంగాను, దౌర్జన్యయుతంగాను ఉండొచ్చు. లేక, బ్రిటన్‌లో 1688లో జరిగినట్లు శాంతియుతంగానుండొచ్చు. 1868 లో జపాన్‌లో గొప్పమార్పుకల్గింది. దానిని, జపానీయులు-ముఖ్యంగా అధికారవర్గం-మరికొందరు పాశ్చాత్య చరిత్రకారులు విప్లవం అంటున్నారు. నిజంలో ఆమార్పును విప్లవం అనడానికి వీల్లేదు. పదభ్రష్టులైన ఒక సంతతివారిని పునఃప్రతిష్ఠించడం-చక్రవర్తులుగా-గనుక. ఇదే విప్లవమైతే మన దేశంలో స్వదేశసంస్థానాల్లో అడప తడప జరిగే పదవీ స్వీకారాలు - పదభ్రష్టత్వాలుగూడా విప్లవాలే గావాలి. కొందరు 1868 లో జపాన్‌లో జరిగినమార్పును బూర్జువా (ధనికవర్గం) విప్లవం అంటారు. నిజంలో అది విప్లవంగాదు-మోసం. నేటి జపాన్‌పునాదులు ఆ మోసంలో వేయబడ్డవి గనుక దాన్నిగురించి సంపూర్ణంగా అవగాహన చేసుకుంటే గాని నేటిజపాన్ను అర్థం చేసుకోను వీల్లేదు.

ఈ "విప్లవ"ఫలితంగా టొకుగవా షోగునేట్ అధికారం అంతమొందింది. చక్రవర్తి ఆధిపత్యం పునస్థాపన చెందింది. టొకుగవా షోగనేట్‌కుచెందిన ఇడో యుగ మంతరించి చక్రవర్తి మరల అధికారానికిరావడంతో మైజియుగం (1868-1912) ప్రారంభమైంది. ఈ విప్లవానికి కారణాలు ముఖ్యంగా నాల్గు—1. విదేశీయులపట్ల ద్వేషం, 2. షోగన్ల

పట్ల అసూయ, 3. చక్రవర్తిపట్ల భక్తి, 4. దేశంలోని నూతన వర్గసంబంధాలు.

క్రీ॥ శ॥ 1542 లో పోర్చుగీస్ నావికులు జపాన్‌ను కనుగొన్నారు. 1549 లో ఫ్రాన్సిస్ జేవియర్ క్రైస్తవమతాన్ని జపాన్‌లో ప్రచారంచేయ మొదలెట్టాడు. క్రైస్తవమత ప్రచారం 50 ఏండ్లపాటు సాగిందో లేదో 1587 నుంచి జపానీయులు క్రైస్తవులను హింసించ నారంభించారు. క్రైస్తవ సంఘాలను పూర్తిగా రూపుమాపారు. 1589 లో హిడియోషిచక్రవర్తి క్రైస్తవమతాన్ని బహిష్కరిస్తూ శాసించాడు. (1592-93 లో యీచక్రవర్తి చైనాను జయించాలని ఆశగొన్నాడు. అందుకు హంసపాదిగా చైనాకు చెందిన కొరియాను, 1,50,000 సైన్యంతో ఆక్రమించాడు.) ఈ హింసకు జపాన్‌వారు చెప్పిన కారణాలు యీ మతసంస్థలకు విదేశ వ్యాపారసంస్థలకు, విదేశసామ్రాజ్యవాదులకు సంబంధముందని, వీరందరుకలసి జపాన్ స్వాతంత్ర్యాన్ని నాశనం చేయను కుట్రలు బన్నుతున్నారని.

"విదేశీయులు 'వ్యాపారం, క్రైస్తవమతప్రచారం' అన్నమిషతో ప్రజల భూమిని, బట్టను, కూటిని దోచుకుంటున్నారు. మన మహర్షుల బోధనల తలక్రిందులుచేయడమే గాకుండా నల్లమందుమూలాన మనకు విషం పెట్టున్నారు: రంకుబోతుతనంతో మనల నిర్వీర్యుల చేస్తున్నారు"

అని జపాన్‌వారి వాదన. ఈ ప్రచారం-విదేశీయులకు విరుద్ధంగా-దేశమంతటా వ్యాపించింది. విదేశీయుల సంపర్కంవల్ల ప్రజలలో కొంతచైతన్యం కలుగకతీరదని, తత్ఫలితంగా తమ ఆధిపత్యానికి ముప్పురానున్నదని గ్రహించి షోగన్లు తమ

షోగునేట్లను (జమీందార్లను), షింటోమతాన్ని, అప్పటి సాంఘికవ్యవస్థను నిలబెట్టు నుద్దేశంతో ప్రజలలో విదేశీయులమీద ద్వేషాన్ని రేకెత్తించారు. 17-వ శతాబ్దంలోనే జపాన్ విదేశీయుల తన దేశంలో అడుగు పెట్టనివ్వగూడదని తీర్మానించుకుంది. అంతేగాదు, తన ప్రజలెవ్వరు విదేశాలకు వెళ్ళగూడదని నిష్కర్ష చేసింది. రహస్యంగా ప్రజలెవ్వరైనా విదేశాలకు వెళ్తారేమోనన్న భయంతో నౌకా నిర్మాణాన్ని నిషేధించింది. 1622–24 లో విదేశీయులను జపాన్‌నుంచి తరిమివేయడమే గాకుండా క్రైస్తవులను హింసించడం మితిమీరిపోయింది. 1638 లో పోర్చుగీసువారిని దేశంనుంచి తరిమివేశారు. క్రైస్తవమతం రూపుమాసిపోయింది.

కానీ, యీ సన్యాసత్వం చాలాకాలం సాగిందిగాదు. 1853 లో తన 'నల్లఓడలు' తో కమ్మొడోర్ పెర్రీ-జపాన్, అమెరికాలకు వ్యాపారసంధి కుదర్చను జపానుకొచ్చాడు. మొదట అమెరికాతో ఒడంబడిక కుదుర్చుకోడానికి జపాన్ వారు నిరాకరించారు. కానీ అమెరికావారి యుద్ధనావలను జూచి భయపడి 31-1-1854 న వ్యాపారపు టొడంబడిక కుదుర్చుకున్నారు. ఈ ఒడంబడిక చక్రవర్తి అనుమతిలేకుండా అప్పట్లో అధికారంలోనున్న టొకుగవ షోగన్ అమెరికాతో కుదుర్చుకుంది. తర్వాత 1859 లో ఇంగ్లండు, హోలండు, ఫ్రాన్స్, రష్యా మొదలైన పాశ్చాత్యదేశాలతో-వాటి ఒత్తిడిపై-జపాన్ వర్తకపు టొడంబడికలు చేసుకోవలసొచ్చింది.

షోగన్లు, డైమ్యో (జమీందార్లు) భూమినంతను తమ సొంతఆస్తిగా నుంచుకొని అధికారం చెలాయించడంమూలాన

పెటీబూర్జువాజీకి (మధ్యతరగతి ప్రజలకు) కళ్ళు వొచ్చింది. ఏలాగైనా టొకుగవా షోగన్ను అధికారంనుంచి తొలగించాలని మధ్యతరగతి ప్రజలు తరతరాలుగా ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఈ బూర్జువానాయకులు పేరు, వూరులేని చక్రవర్తిచుట్టూ మూగారు. 1859 లో వారికి మంచిఅవకాశం దొరికింది. చక్రవర్తి ఉత్తర్వు-కనీసం అనుమతియైనా-లేకుండా షోగన్లు విదేశస్థులను జపాన్‌లో అడుగుబెట్టనిచ్చారుగనుక విదేశీయులతోపాటు షోగన్లనుకూడా నాశనంచేయాలని, చక్రవర్తికి సర్వాధిపత్యం సమకూర్చాలని ప్రచారం సాగించారు.

విద్యాగంధం, సంస్కృతి ఏమాత్రంలేని నిరుపేద ప్రజలు చక్రవర్తి పట్లగల తమ మూఢభక్తి కారణంగా యీ బూర్జువా వాదనవిని, మోసపోయి విదేశీయులను చంపనారంభించారు; షోగన్లను అధికారంనుంచి తొలగించను పూనుకున్నారు; చక్రవర్తిని పునఃప్రతిష్ఠించాలన్నారు. అంతఃకలహాలు, అంతర్యుద్ధం ప్రారంభమైనై. దేశమంతటా అల్లుకున్నై. ఈ అతర్యుద్ధాల్లో సమురే గొప్పపాత్ర వహించింది.

షోగన్లు ప్రపంచ పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకోగల్గారు. పారిశ్రామిక విప్లవం ప్రపంచమంతటిని వ్యాపిస్తూన్న 19 వ శతాబ్ద మధ్యకాలంలో జపాన్ మడిగట్టుకోని కూర్చోవడం—జపానేమిటి! ఏదేశంగాని—అసాధ్యమని, అనవసరమని, అసంభవమని గ్రహించారు. దేశంలోని అంతఃకలహాలు కారణంగా షోగన్లు తామే-తమంతట-లొంగిపోయి,

చక్రవర్తిని నామమాత్రంగా సింహాసనంమీద కూర్చోబెడితే తెరచాటునుండితామే నాటకమైనా ఆడొచ్చని గ్రహించారు. చక్రవర్తిపట్ల ప్రజలకు గొప్పమూఢభక్తి గలదని షోగన్లెరుగుదురు. ఈ మూఢభక్తి కారణంగానే తమవర్గం-అందున తమ కుటుంబం-యిన్ని శతాబ్దాలుగా అధికారం చెలాయించగల్గిందనికూడా వారెరుగుదురు.

తమ దేశంలోని వర్గసంబంధాలను యథాస్థితినుంచడానికి, కష్టజీవులలో చైతన్యం కలుగకుండా చేయడానికి తాము చక్రవర్తిని పునఃప్రతిష్టించడం అవసరమని షోగన్లు గ్రహించారు. ఏదొ ఒక షోగన్-టొకుగువ షోగన్-పేరుతో తాము అధికారం చలాయించడంవల్ల తమ (షోగన్ల) లోనే భేదాలు హెచ్చడం, తమ అంగరక్షకులైన సమూరేలలో అంతర్యుద్ధాలు సాగడం, తత్ఫలితంగా జమీందారి వర్గం మొత్తం బలహీనతచెందడం సంభవించిందని గ్రహించి టొకుగవా షోగనే తమ అధికారం (వ్యక్తిగతంగా) రూపుమాసినాసరే తమ వర్గాధిపత్యం శాశ్వతంగా నుండాలన్న స్థిరసంకల్పంతో చక్రవర్తిని రాజ్యాధిపతిగా నెలకొల్పను, తమఅధికారాన్ని విసర్జించనుగూడా అంగీకరించారు. అప్పట్లో చోషు, సట్సుమ మొదలైన షోగన్ల ఆస్తి దేశంలోని వ్యవసాయ భూమిలో ¼ వంతైయుండేది. అట్లుండిగూడా వారు స్వలాభాసికన్నా వర్గలాభం వాంఛనీయమని చాటారు.

పూర్వం బియ్యం డబ్బుగా నుపయోగింపబడేది. ఈ విప్లవానికి పూర్వమే-ఇడొయుగంలో-నాణాలు వాడుకలోకొచ్చినై. నూరక విధానం మారింది. దేశంలో వ్యాపారం,

యితర దీవులతో వ్యాపారం పెచ్చుపెరిగింది. ఈ స్వదేశ, విదేశ వ్యాపారాభివృద్ధి ఫలితంగా నూతన ధనికవర్గం-పెట్టుబడిదారివర్గం-తలచూపింది. ఈ పెట్టుబడిదారివర్గానికి డబ్బే ఆధారం. జమీందారులకు భూమాధారం. ఈ రెండు వర్గాలకు ఘర్షణ తప్పిందికాదు. ఈ వ్యాపారులు కలుగజేసుకోడంమూలంగా జమీందారుల జీవనాధారమైన బియ్యం ధర తగ్గనారంభించింది. ఒసాకా, క్యోటో మొదలైన పెద్ద పట్టణాల్లో వ్యాపారం హెచ్చడంవల్ల మారకపు బజార్లుగూడ స్థాపింపబడినై. ధరలు హెచ్చడం, తగ్గడంమూలాన-అందున ముఖ్యంగా వడ్లధరలు-డెయిమ్యో, సమూరే మొదలైన సుఖజీవుల ఆదాయం తగ్గనారంభించింది. త్వరలోనే వీరు బియ్యపువర్తకులకు, వడ్డీ వ్యాపారస్థులకు ఋణపడనారంభించారు. తమ వరుంబడి తగ్గినకొద్దీ యీ కొద్దిపాటి భూస్వాములు రైతులను పీడించ మొదలెట్టారు. విధిలేక, అక్కడక్కడ రైతు తిరుగుబాట్లు జరిగాయిగాని అధికారం తమచేతనుండడంచేత జమీందారులీ తిరుగుబాట్లను సులభంగా అణచివేయగల్గారు. అప్పట్లో దేశాన్ని పరిపాలిస్తూన్న షోగునేట్-టొకుగవా-దివాలా తీసింది. క్రమేణా జమీందారి విధానం పలుకుబడి సన్నగిలి వర్తకుల-పెట్టుబడిదారుల అధికారం బలీయమైంది.

## మార్పు

1863 లో సుమారు 260 సంవత్సరాలుగా అజ్ఞాతవాసంలో అడుక్కుతింటూన్న చక్రవర్తి కుటుంబం మళ్ళీ సర్వాధిపత్యాని కొచ్చింది. ఈ విప్లవానికిపూర్వం జపాన్

లోని జమీందారి సాంఘికావస్థలో 4 వర్గాలుండేవని ముందే గమనించాం. ఈ విప్లవఫలితంగా సాంఘికజీవనంలో చాల మార్పులు గలిగాయి. ఈవిప్లవానికిపూర్వం 100 సంవత్సరాలుగా సంఘంలో గొప్పగొప్పమార్పులు గలుగుతూనే వున్నాయి. అవే యీ విప్లవానికి, విప్లవానికి తదనంతరం కల్గిన మార్పులకు పునాదులయినాయి.

18 వ శతాబ్దంలోగల్గిన సంస్కృతి ఫలితంగా జపాన్‌లో కొద్దిమంది విజ్ఞులేర్పడ్డారు. వీరుగూడ 1868 లో జమీందారీ విధానాన్ని ధ్వంసంచేయను ధనికవర్గానికి తోడ్పడ్డారు. అంతదనుక తమలదోచుకుంటూన్న జమీందారి వర్గాన్ని ప్రజలందరేకమై—సమురాలే, కొత్తగానేర్పడిన మేధావులు, పాటకజనం, వ్యాపారులు, ధనికవర్గం—ధ్వంసం చేశారే గాని అధికారాన్ని హస్తగతం చేసుకోలేకపోయారు. ఇందుకు కారణం శ్రామికవర్గానికి తగిన చైతన్యం, నాయకత్వం లేకపోవడమే. అదునుజూచి, ఈ విప్లవాన్ని రేకెత్తించిన, కొంతవరకు యీ విప్లవానికి కారకులైన నూతన ధనికవర్గం ప్రభుత్వాన్ని తనచేతికి లాక్కోగల్గింది. కానీ యీ పెట్టుబడిదారివర్గం, అధికార ఫలితంగా సంక్రమించే సుఖాన్ని ఆనందించలేక పోయింది. త్వరలోనే పాశ్చాత్య సామ్రాజ్యవాదుల నెదుర్కోవలసి వచ్చింది. ఈ బాహ్యవిరోధుల నెదుర్కోడానికి చేతగాక నూతన అధికారవర్గం(ధనికవర్గం)చక్రవర్తిచుట్టూ మూగింది. విదేశీయుల నెలాగైనా దేశాన్నుంచి నెళ్ళగొట్టాలని, తమ పుణ్యభూమి నితరులు మెట్టగూడదని చక్రవర్తికి బోధించ నారంభించింది. షోగన్లు విదేశీయులను

దేశంలోకి రానిచ్చారన్న నెపంతో, చక్రవర్తిపేర ప్రజలం దరు ఏకమయ్యారు. ఎన్నడులేని యీ ఐక్యత యీ విప్లవా నికి మొదటి ఫలితం. చక్రవర్తిపక్షం వహించినవారిలో బీద రైతులు, కూలీలు, కౌలుదార్లు, వడ్డీవ్యాపారస్థులు, బీదలైన సమూరైలేగాక సట్సుమ, చోషు, టోగ మొదలైన జమీం దారులుగూడ నున్నారు. షోగన్ల అధికారం రూపుమాసిం తర్వాత చక్రవర్తికి సాయపడ్డ వర్గాల్లో అంతఃకలహాలు చెల రేగి తుట్టతుదకు ధనికవర్గం అధికారానికొచ్చింది. అందు వల్లనే నేటికి జపాన్‌లో పూర్వపు నాలువర్గాలు అలాగే నిలి చి ఉన్నాయి. షోగన్ల అధికారాన్ని ధనికవర్గం లాక్కోడం తప్ప యీ విప్లవఫలితం మరేంకనపడలేదు. అందువల్లే యీ మార్పును విప్లవమనడంకన్నా మోసమనడం సమంజసం.

మెయిజీ ఉద్ధరణ (1868) ఫలితంగా జమీందారులం దరు తమ పెద్దపెద్ద జమీన్‌లను 'తమంతటతామే' చక్రవర్తికి సమర్పించుకున్నారు. 'తమంతటతామే' అనడంలో గూడార్థం చాలాఉంది. తమభూములను వదలుకొమ్మని వారినెవ్వరు బలవంతపరచలేదుగాని వారీపాటి త్యాగాన్ని ఉచితంగా చేశారుకారు. డెయ్‌మ్యోకు, తమభూములను వదలుకున్నం దుకు మొదట సాలీనా కొంతసొమ్ము ప్రభుత్వమివ్వ నారంభిం చింది. అంతటితో జమీన్‌ల నర్పించుకున్నవారి సంఖ్య హెచ్చుగా జొచ్చింది. బొక్కసం ఖాళీ గాసాగింది. అందు చేత ప్రభుత్వం యీ భూస్వాములందరికి పారితోషికం ఒక్క మారే చెల్లించింది. ఎలాగైతేనేం మొత్తం జమీందారులం దరికి రూ 31,65,00,000 లు ముట్టినై.

డేయ్‌మ్యో యీ డబ్బును వర్తకానికి, పరిశ్రమలకు, బాంకులకు పెట్టుబడి పెట్టింది. పైగా జమీందార్లు తమపాత అప్పులను ఎగ్గొట్టొచ్చని ప్రభుత్వం శాసించింది. ఈ భూస్వాములు పూర్వంలాగా సొంతసైన్యాలనుంచుకో కూడదని కూడా శాసించింది. భూస్వాముల జమీన్‌లు పోయినా పూర్వంలాగా సమూరేలను మేపవలసిన అవసరంలేదు గనుక- మేపవీల్లేదుగనుక- వారి ఖర్చుతగ్గింది. వారి సొంత భూములు, ప్రభుత్వం పారితోషికంగా నిచ్చిన రొక్కం సుఖ జీవనాన్ని గడపను వారికి చాలు. నూతన ప్రభుత్వంలో గొప్పగొప్ప ఉద్యోగాలు పలుకుబడిగల సమూరేలకు లభించినై. 1868లో తట్టుబోసి 'కొమై' చక్రవర్తి చనిపోయాడు. కొత్త చక్రవర్తి 16 ఏండ్లబాలుడు. అతడు నిస్సహాయుడుగా నుండడంవల్ల సమూరేలు చక్రవర్తిపేర అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. సట్సుమా సమూరే నౌకాబలాన్ని తన అధికారంలో నుంచుకుంది. వీరికి విరోధియైన చోషుసమూరే సైన్యాన్ని తాను వశపరచుకుంది. ప్రభుత్వోద్యోగాలన్నీ తక్కిన సమూరే నాయకులు పంచుకున్నారు. నేడు జపాన్ ప్రభుత్వోద్యోగుల సంఖ్య 50,00,000. ఉద్యోగాలు దొరకని సమురేలకు కండ్లనీళ్లు తుడవను ఏదోకొంత (ముండ) భరణాలిచ్చింది ప్రభుత్వం. అసంతృప్తిచెందిన సమూరేలు నూతన ప్రభుత్వం పట్ల ద్వేషం బూనారు. వారిని తృప్తిపరచనే 1873 లో ప్రజలందరు సైనికశిక్షణను బొందాలని ప్రభుత్వం శాసించింది. అంతటితో అసంతృప్తిచెందిన

సము రేలు చక్రవర్తికి నమ్మకంగల, విశ్వాసపాత్రులైన సైనికులుగా తయారయ్యారు.

కొత్తగాఏర్పడ్డ ధనికవర్గం నూతనప్రభుత్వంలో హెచ్చు ధికారాన్ని సంపాదించింది. ఈవర్గాన్ని జపాన్ భాషలో 'చోనిన్' అంటారు. ఈ నూతన బూర్జువావర్గం నేటి జపాన్ పరిశ్రమలపెట్టుబడిలో ¾ భాగం తన సొంతం చేసుకుంది. పరిశ్రమలను తమవశం చేసుకోను కొన్ని గుత్తవ్యాపారసంస్థ లేర్పడ్డయి. వీటిలోవీటికి పైపోటీరాకుండా యీ గుత్తవ్యాపారసంస్థలుకలసి పనిచేసేవి. ఈ కలయికను 'జబైట్సు' అంటారు జపాన్ భాషలో. నేటి జపాన్ రాజకీయపార్టీలన్నీ 'జబైట్సు'చేతి కీలుబొమ్మలుగా పని చేస్తున్నాయి. మొదటి నుంచి జమీందారీ విధానాన్ని రూపుమాప ప్రయత్నించి, షోగన్లతో విరోధం కల్పించుకొని అష్టకష్టాలుపడ్డ రైతులు-శ్రామికులు యీ విప్లవంవల్ల యేమాత్రం లాభం పొందక పోవడమేగాకుండా, యింతదనుక వీరికి ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని రేకెత్తించిన ధనికవర్గం యిప్పుడు జమీందారులతో ఏకమై వీరిని దోచుకో నారంభించింది. సాంఘికజీవనంలో కొంత మార్పు గల్గిందన్నమాట నిజమేగాని—బానిసత్వం నిర్మూలింపబడడం, రైతులకు భూమి సొంతాని కివ్వబడడం-యీ కొద్దిమార్పువల్ల వారికేపాటిలాభం కల్గలేదు. రైతుల సొంతానికిచ్చిన భూములు కొద్దిపాటివి. వారి కుటుంబాల పోషించను చాలనేచాలవు. పన్నులపరిమితంగా హెచ్చింపబడ్డాయి. ఇందుకుతోడు జనాభా హెచ్చుగాజొచ్చింది. భూమిమీది ఒత్తిడి హెచ్చైంది. భూమి నాధారంచేసుకొని

జీవించేవారిసంఖ్య మితిమీరిపోయింది. రైతులు, విప్లవానికి పూర్వంలాగా మళ్ళీ అప్పుల పాలయ్యారు.

ఈ విప్లవ ఫలితంగా తన ఘోషానుండి బయటపడి జపాన్ కండ్లు తెరిచి నలుప్రక్కల చూచేప్పటికి తక్కిన ప్రపంచమంతా—ముఖ్యంగా యూరప్, అమెరికాలు—పారిశ్రామిక విప్లవాన్ని దాటి సామ్రాజ్యావిస్తరణ విధానాన్ని అమలులోకి దెచ్చినై. అప్పటికే యీ భూగోళమంతటిని సామ్రాజ్యవాద దేశాలు పంచుకున్నాయి. ఈ నాల్గు స్తంభా లాటలో అన్ని స్తంభాలనంటి అందరున్నారు. పాపం! జపాన్ కే స్తంభం ఖాళీగా లేదు. తమ దుసికి కారణం పారిశ్రామికంగా తమ దేశం వెనుకబడియుండడమేనని జపాన్ వారు గ్రహించారు. ఇంగ్లండు, అమెరికాలవంటి దేశాలు 150 ఏండ్లలో సాధించిన పారిశ్రామిక విప్లవాన్ని జపాన్ వారు 50 ఏండ్లలో పూర్తిచేయ పూనుకున్నారు. దేశంలోని సొంత ఆస్తులను రూపుమాపు నేదోనొక నిర్ణీతవిధానా న్ననుసరించి పారిశ్రామికవిప్లవానికి ప్రయత్నిస్తే—సోవియట్ రష్యాలాగా—యిప్పటి యిక్కట్టులు కొంతవరకు లేకుండా జపాన్ నెగ్గగ్గలేది. తమ సాంఘిక గురవస్థను యధాప్రకారముంచి పారిశ్రామికవిప్లవానికి, పాశ్చాత్య పెట్టుబడిదారి దేశాలతో స్పైపోటీకి ఉరకడంవల్ల సులభంగా పరిష్కరింపబడని సమస్య లేర్పడ్డాయి జపానుకు.

ప్రపంచవ్యాపారాన్ని కొంత తనవశంచేసుకోను జపాన్ అతి చాకచక్యంతో తన రాజనీతిని సాగించింది. ఒకటి తర్వాత నొకటిగా పాశ్చాత్యసామ్రాజ్యవాద ప్రభుత్వా

లతో స్నేహంచేసుకొని వాటిలో వాటికి విరోధం కల్పించి తాను వలసరాజ్యాల సంపాదించగల్గింది. కానీ యెంతప్రయత్నించినా దినదినాభివృద్ధి చెందుచున్న తన జనబాహుళ్యానికి తగినసామ్రాజ్యం లభింపక పోవడంచేత చైనామీద కురికింది. 5 ఏండ్లుగా చైనాతో పోరాడి హెచ్చు ఫలితమేమీ లేక పోవడంచేత మంచి అదునుచూచి పాశ్చాత్యసామ్రాజ్యాల ఆస్థులను దొంగలించ మొదలెట్టింది. ఏత త్విధానమే ప్రస్తుత యుద్ధం.



పై జపాను బాలుని వయస్సు 6 ఏండ్లు. ఇప్పటి కప్పుడే వ్యాయామశిక్షణను పొందుచున్నాడు.

౮

## హిరోహిటో చక్రవర్తి.



జనవం 1901లో. పట్టాభిషేకం 25-12-1926 న. 'జనరల్' రూపుమాసినందున 'సుప్రసిద్ధ యుద్ధసమితి' చేతి కీలుబొమ్మగా నున్నాడు. గృహస్థు. పిల్లలున్నారు. పాశ్చాత్యదేశాలకెళ్ళి వచ్చినవాడు.

# 2. పరిపాలనా విధానం.

## చక్రవర్తి

జపాన్ వారి దేవత అమాటెరసు-ఓ-మికామి వారి దేశాన్ని, వారిని, వారి చక్రవర్తిని సృష్టించింది. ఆమె సంతతి వారిలో 5-వ వాడైన జిమ్ము టెన్నో క్రీ॥ పూ॥ 660 లో ప్రథమ జపాన్ చక్రవర్తిగా పాలించాడు. ఈ దేవత సంతతి వాడుగనుక జపాన్‌చక్రవర్తి ప్రజలకు కేవలం చక్రవర్తి మాత్రమేగాక మత గురువుగా గూడా నున్నాడు. ప్రస్తుతం జపాన్ను పరిపాలిస్తూన్న హిరొహిటో చక్రవర్తి 1901 లో పుట్టాడు. 1926 డిసెంబరు 25 న పట్టాభిషిక్తుడయ్యాడు. విదేశీయులితడ్ని మికాడో అని పిలుస్తారుగాని యీతని బిరుదు టెన్నో. 2-11-1889 న మొదటిసారి జపాన్ చక్రవర్తి తనప్రజలకొక నిర్మాణచట్టాన్ని ప్రసాదించాడు. ఈ చట్ట నిర్మాత—అధిపతి చక్రవర్తే. యుద్ధాలు ప్రకటించను, రాజీలు చేసుకోను, శాసనసభలను సమావేశపరచను-రద్దు పరచను, మంత్రిసభలను నియోగించను-తొలగించను, చట్టాలనామోదించను, అత్యవసర చట్టాలను శాసించను-అములునందుంచను, సైన్యానికి, నౌకా విమానబలాలకు సర్వాధిపత్యం వహించను—యీ హక్కు-బాధ్యతలన్నీ గూడా చక్రవర్తివే. జపాన్‌లో సర్వాధిపతి చక్రవర్తే. పైగా మత గురువు. షింటోమతానికి—ప్రభుత్వంగీకారంగల మతం అదొక్కటే—పెద్ద యీతడే. సంఘానికి నాయకుడు చక్రవర్తే. చక్రవర్తి కుటుంబాన్ని చూచి ధనికవర్గం ప్రతిష్ఠపమ్యం నేర్చు

కుంటూంది. దేశంలో చక్రవర్తికి మించిన ధనికు డెవ్వడు లేడు. అతని కుటుంబాస్తిమొత్తం విలువ రూ. 150,00,00,000 కెక్కువుంటుంది. ఇంత ధనసంపన్నుడవడంచేత సంఘాని కాతడే పెద్దగావడంలో చిత్రమేముంది? దేశంలో ఏపని జరిగినా—మంచిగాని, చెడ్డగాని—చక్రవర్తి పేరనే జరుగుతుంది. దేశంలోని మహా అన్యాయాలన్నీ చక్రవర్తి పేరనే సమర్థింపబడుతున్నాయి.

చక్రవర్తి అధికారమంతా పేరుకేగాని వాస్తవంలో జపాన్‌లో సర్వాధికారం ధనికవర్గం-సేనానాయకులు పంచుకుంటున్నారు. ఆంగ్లేయ గ్రంథకర్త ఒకాతను బ్రిటిష్‌చక్రవర్తి మంత్రులచేతి కీలుబొమ్మని, ప్రధాని చక్రవర్తి మరణదండన ఉత్తరువును తెచ్చి ముందుంచినా చక్రవర్తి సంతకంచేయక తప్పదని వ్రాశాడు. జపాన్‌చక్రవర్తిగతి అంతకంటే నీచం. ఈ చక్రవర్తిచుట్టూ మూగియుండే సేనా నాయకులు, కోటీశ్వరులు ఏ ఆటాడమంటే అతడా ఆటాడాలి. పైగా బాధ్యత తనదే. ఈ బలవంతపు సలహాదారులది గాదు. ప్రజాశక్తుల నణగద్రొక్కి తమ స్వలాభాలను చక్కబెట్టుకోడానికి ప్రతివారు—పెద్ద పెద్ద గుత్తవ్యాపారస్థులు, ప్రభుత్వోద్యోగులు, సేనానాయకులు, నౌకాదళాధిపతులు, రాజకీయవేత్తలు, ఫాసిస్టులు—చక్రవర్తిచుట్టూమూగి, అతనిపేరనే వ్యవహరిస్తుంటారు.

చక్రవర్తికి సలహాలివ్వను అనుభవజ్ఞులైన రాజకీయవేత్తల సభొకటుంది. దీనిని 'జెన్‌రో' అంటారు. ఈసభ సభ్యులందరు చనిపోయారు. కొత్తసభ్యులను నియోగించడం

లేదు. అందువల్ల చక్రవర్తికి సలహాలివ్వను ప్రస్తుతం మరొక సభ ఏర్పరుపబడ్డది. ఇందులోనిసభ్యులు, మాజీ ప్రధానులు, ప్రస్తుత సైన్యాధిపతులు, నౌకాదళాధ్యక్షులు, ప్రివికౌన్సిల్ (పెద్దలసభ) అధ్యక్షుడు, లార్డు ప్రీవిసీల్ మొదలైనవారు.

## ప్రజాస్వామ్యం

2-11-1899 న అప్పటి చక్రవర్తి తన ప్రజలకొక నూతన నిర్మాణచట్టాన్ని ప్రసాదించాడని గమనించాం. ఈచట్టాన్ననుసరించి జపాన్ డయట్ (శాసనసభ) ఏర్పడ్డది. ఈ శాసనసభ శాఖలు మన దేశంలోవలెనే రెండు—(1) ప్రభువుల సభ. (2) ప్రతినిధుల సభ. ఈ రెంటిని కలిపి 'టైకోకుగికేయి' అని పిలుస్తారు.

ప్రభువుల సభలో 411 మంది సభ్యులున్నారు. రాజకుటుంబానికి చెందిన రాకొమరులకు యిందులో 67 స్థానాలు ప్రత్యేకింపబడియున్నై. ఈ స్థానాలు, పిత్రార్జితంలాగా వంశపారంపర్యా సంక్రమించేవి. జపాన్ ప్రభువులలో అనేక తెగలవా రున్నారు. వారందరుకలిసి యీసభకు 150 మంది సభ్యులనెన్నుకుంటారు. మాజీ ప్రభుత్వోద్యోగులు, ప్రస్తుత ప్రభుత్వోద్యోగులు కలిసి 100 మంది సభ్యులనంపుతారు. 'చక్రవర్తి విజ్ఞాన కళాశాల' తరఫున 4 గురు సభ్యులను చక్రవర్తే నియోగిస్తాడు. హెచ్చుపన్నులను చెల్లించేవారు 70 మంది సభ్యులనంపుతారు. ఈవిధంగా జపాన్‌లోని 900 ధనికకుటుంబాలు, ప్రభుత్వోద్యోగులు, 217 సభ్యులతో 'ప్రభువుల సభను' ఆక్రమించుకున్నారు. ఈసభకు 'ప్రతినిధు

లసభ' తోపాటు సమానాధికారా లున్నాయి. ప్రభువుల సభలో 192 మంది సభ్యులు జీవిత సభ్యులు.

ప్రతినిధి సభకు 4 ఏండ్లకొకసారి 466 మంది ప్రతినిధులను ప్రజలెన్నుకుంటారు. జపాన్‌లో 24 ఏండ్లు నిండినగాని మైనారిటీ తీరినట్లుగాదు. 24 ఏండ్లు నిండినవారికే ఓటింగ్ హక్కు. స్త్రీలకు మొన్నటివరకు ఎన్నిక హక్కులేదు. 'మంత్రి సభ' యీ 'సైకోకుగికేయి'కి బాధ్యురాలుగాదు. చక్రవర్తికి మాత్రమే బాధ్యురాలు. ప్రభుత్వ వ్యయంలో హెచ్చుభాగం—మనదేశంలోవలెనే—శాసనసభల వోటుతో నిమిత్తం లేకుండా చక్రవర్తిచే ఆమోదింపబడుతుంది. ఏ కారణంచేతనైనా శాసనసభ 'ఆదాయ-వ్యయపట్టీ'ని ఆమోదించకపోతే ముందు సంవత్సరపు 'ఆదాయ-వ్యయపట్టీ' ననుసరించి ప్రభుత్వం సాగుతూనే వుంటుంది. మంత్రులు పెట్టింది బిక్ష.

సైన్యాధిపతులు, నౌకాధిపతులు యెక్కువగా రాజకీయాల్లో కలుగజేసుకోడంవల్ల 1882 లో ప్రభుత్వోద్యోగులు రాజకీయాల్లో కలుగజేసుకో కూడదని చక్రవర్తి శాసించాడు. 1887లో చక్రవర్తికి, సైనిక-నావిక విషయాల్లో తగిన సలహాలివ్వను 'సుప్రసిద్ధ యుద్ధసమితి' ఒకటి స్థాపించబడ్డది. 1895 నుంచి సైన్య, నౌకాధిపతులే యుద్ధ, నౌకామంత్రులుగా నియోగింపబడాలని తీర్మానించారు. ఈ మంత్రులిద్దరకు మాత్రమేగాక యితర సైన్యాధిపతులు, నౌకాధిపతులు— మంత్రివర్గంతో నిమిత్తంలేకుండా—చక్రవర్తితో వ్యవహరించొచ్చు. ఈ అధికారం తనచేత (సుప్రసిద్ధ యుద్ధసమితి)

నుండడంచేత చక్రవర్తిని తన గుప్పెట్లోనుంచుకొని, ఆతని పేర మంత్రివర్గాన్ని నిర్మించను - రద్దుచేయను, ప్రభుత్వ చర్యలను తన యిష్టానుసారం సాగించను వీలైంది. ఈ 'సుప్రసిద్ధ యుద్ధసమితి'లో సభ్యులుగానున్న ఒకరిద్దరు సేనానాయకులు జపాన్ దుండగాలన్నిటికీ కారకులు. 1936 ఫిబ్రవరి 26 న జరిగిన ఘోరహత్యలఫలితంగా ప్రజలలోగల్గిన ఆక్రోశాన్నిగ్రహించి చక్రవర్తి మందలించిన తర్వాత యీ సభనుండి సేనానాయకులు రాజీనామా నిచ్చారు.

జబైట్సు దేశంలోని ముఖ్యమైన రెండు రాజకీయ పార్టీలను, ముఖ్యమైన వార్తా పత్రికలన్నింటిని తన అరచేత నుంచుకొనియుంది. 'ప్రతినిధి సభ' సభ్యుల ఎన్నిక ఖర్చులు ప్రతిఒక్కనికి సుమారు రూ 75,000. గ్రామాల్లో ఓటు 1కి రూ 3-0-0 చొప్పున, పట్టణాల్లో ఓటు 1కి రూ 15-0-0 చొప్పున కొంటారు. ఓడిపోయిన అభ్యర్థులందరు తాము కట్టిన డిపాజిట్టు రూ 3,000 వదలుకోవలసిందే. ప్రజలందరికి ఎన్నికహక్కు యివ్వబడ్డతర్వాత (1925 అనంతరం) మొదటి ఎన్నికలు 1928 లో జరిగాయి. ఈ ఎన్నికలలో యితర ఖర్చుగాక కేవలం ఓట్లను కొననుమాత్రం రూ 15,00,000 ఖర్చయింది. ఈ ఎన్నికలకు మిట్సుయి, మిట్సుబిషి గుత్తవ్యాపార సంస్థలు రూ 2,85,00,000 ఖర్చు చేసినై.

జపాన్‌లోని గొప్ప వార్తాపత్రికలన్నీ యీ రెండు సంస్థలసొంతమే. 'ఒసాకా మెయ్‌నీచి', 'టోకియొ మెయ్‌నీచి', 'షుగెయ్ షొగియొ షింబియన్' మొదలైన పత్రికలు మిట్సు

యిసొంతం. 'ఒసాకా అసాహి', 'టోకియొ అసాహి', 'టోకియొ నిచినిచి' మొదలైనవి మిట్సుబిషి సొంతం. 1925 లో నిర్మాణ చట్టాన్ని మార్చకముందు ఓటర్ల సంఖ్య 30,00,000 మాత్రమే. వయస్సువచ్చిన ప్రతిపురుషునికి ఎన్నికహక్కు (1925 చట్టంద్వారా) సంక్రమించి నప్పటినుంచి ఓటర్ల సంఖ్య 3,00,00,000 కు పెరిగింది. ప్రజలలో యింతమందికి వోటింగ్ హక్కు వుండికూడా వారింత నికృష్టజీవితా న్ననుభవిస్తున్నారంటే జపాన్‌లో ప్రజాస్వామ్యం ఎంతచక్కగా సాగుతుందీ గ్రహించవచ్చు.

1925 నూతన నిర్మాణచట్టాన్ననుసరించి ప్రతిపురుషునికి ఓటు వచ్చిందిగదాఅని ఉబలాటపడ్డారు ప్రజలు. కానీ అధికారవర్గం, సైన్యం, ధనికులు—మొదలైనవారి జులుము, లంచగొండితనం తగ్గాయిగావు. 1928 లో సెయుకేయ్ ప్రభుత్వంలో టనక ప్రభువు ప్రధానిగానున్నప్పుడు లంచగొండితనాలు, అక్రమపద్ధతులు, ప్రభుత్వం ఆచరిస్తున్నట్టు విశదమైంది. 1934 లో ఒకమంత్రి లంచం తీసుకున్నట్టు ఋజువైనందున అప్పటి అడ్మిరల్ ఒకాడో ప్రభుత్వం తొలగింపబడ్డది. 1939 లో బియ్యపు వ్యాపారులనుండి లంచంపుచ్చుకొని ప్రభుత్వం వారికి సాయంచేసినందున జనరల్ ఏబ్ ప్రభుత్వం రాజీనామా యియ్యాలసొచ్చింది. లంచగొండితనం బయటపడ్డప్పుడు నేరస్థులు శిక్షింపబడడం న్యాయం. కానీ జపాన్‌లో యీ నేరాలన్నీ ప్రజాస్వామ్య ఫలితమని, ప్రజాస్వామ్యాన్ని రూపుమాపి నిరంకుశత్వాన్ని స్థాపిస్తేనేగాని యీ నేరాలు మాసిపోవని రాజకీయవేత్తల వాదన.

## ఫాసీజం

ఎన్నికవిధానం మార్చబడాలని, నిర్మాణచట్టాన్నే మార్చాలని జపాన్ అధికారవర్గం ప్రయత్నింపసాగింది. ప్రజాస్వామ్యానికి జపాన్‌కు చాలా దూరమని వాదించింది. ఈ ప్రయత్నాలఫలితంగా నేడు జపాన్‌లో జర్మనీ, ఇటలీలలాగా నిరంకుశత్వం ఏర్పడింది. ప్రజాస్వామ్యాన్ని రూపుమాపను జపాన్ కార్మికసంఘంగూడా తోడ్పడ్డది—వేరుకారణాలవల్ల. 1939లో నౌకాశాఖనాయకుడు, దేశంలో హెచ్చు పలుకుబడిగలవాడైన అడ్మిరల్ సుట్సుగు ప్రజాస్వామ్యాన్ని రూపుమాపి జపాన్ నూతన ఆశయాలకు తగినట్లు కొత్త నిర్మాణచట్టాన్ని ఏర్పాటుచేయాలని కోరాడు.

సేనానాయకుడు, యుద్ధమంత్రియైన జనరల్ టెరౌచి 1936 లో ప్రతినిధిసభలో యిలాన్నాడు—

> "పాశ్చాత్య విధానాలననుసరించి ప్రజాస్వామ్య సంస్థలు మన దేశంలో సాగడానికి సైన్యం ఒప్పుకోదు. ప్రతినిధిసభ, ఎన్నికచట్టాలు రూపుమాపబడాలి. ప్రజాభిప్రాయాలు చక్కగా వెలిబుచ్చబడేట్లు మన జాతీయమేధాశక్తులను ప్రదర్శించడానికి మంచి అవకాశాలు కల్గేట్లు నూతన చట్టమొకటి ఉపపాదింపబడాలి."

జపాన్ కార్మికసంఘంగూడా 1925 నూతన నిర్మాణచట్టాన్ని మార్చాలని ప్రచారంచేసింది. ప్రస్తుత ప్రజాస్వామ్యంలో సైన్యం పలుకుబడి హెచ్చిందిగనుకను, మంత్రులలో లంచగొండితనం మితి మీరడంవల్లను ప్రజాస్వామ్యాన్ని విస్తరింపజేయాలని దీని వాదన, అందులకు మార్పవసరం.

1. జెహోల్
2. ముక్‌డెన్
3. వ్లాడి వోస్టక్
4. పెకింగ్
5. టీయన్‌స్టెన్
6. హాంకో
7. నాంకింగ్
8. టోకియొ
9. యొకొహామ
10. కాన్ టన్
11. హాంకాంగ్
12. సింగపూర్.

నిర్మాణచట్టాన్ని మార్చాలన్న ప్రచారం ప్రబలిన కారణంగా నానాటికి 'కాబినెట్' (కార్యనిర్వాహకవర్గం) అధికారం హెచ్చింది. 1935 లో 'మంత్రివర్గ విచారణ సమితి' నొకదానిని ఏర్పాటుచేశారు. ప్రధాని అధికారాన్ని హెచ్చించను, మంత్రివర్గంలోనే మరో 'రహస్య సమితి' ని ఏర్పాటుచేయను, 'ఐదుగురు మంత్రులసభ' నేర్పాటు చేయను, ప్రత్యేక ప్రభుత్వశాఖలపై అధికార-బాధ్యతలు లేని మంత్రులను నియోగించను ఏర్పాట్లు చేయబడినై. ఈ ఏర్పాట్లన్నిటి ఫలితంగా మంత్రివర్గ బలం అపరిమితంగా హెచ్చింది. 1939 జనవరిలో సెయూకేయ్ పార్టీ నాయకుడు హీరనుమ ప్రభువు (అభివృద్ధి నిరోధకుడు) ప్రధానిగా నున్నప్పుడు ప్రీవీకౌన్సిల్ అధ్యక్షుడైన కొనొాయి రాకుమారుణ్ణి మొదటిసారి ప్రత్యేక శాఖాధికారంలేని మంత్రిగా నియోగించారు. 1940 లో 'ఐదుగురు మంత్రులసభ' నేర్పాటు చేశారు. ఇందులో సభ్యులు ప్రధాని, విదేశాంగమంత్రి, సైనికమంత్రి, నౌకామంత్రి, ద్రవ్యశాఖామంత్రి. 1941 జూలైలో కొనొాయి ప్రభుత్వం కొత్తగా ఏర్పాటుచేయబడ్డ ఉప-మంత్రిపదవికి హీరనుమ ప్రభువును నియోగించింది. నిరంకుశత్వ స్థాపన అవసరమన్న ఈజబ్బు శ్రామికవర్గంలోగూడా వ్యాపించింది. 1938 లో సోషల్ డెమొక్రాటిక్ పార్టీ (సాంఘిక ప్రజాస్వామ్యకక్షి) సభ్యుడొకాతను ప్రతినిధిసభలో అప్పటి ప్రధానియైన కొనొాయి నుద్దేశించి యిలాన్నాడు—

"ముసోలిని, హిట్లర్, స్టాలిన్‌లవలె సాహసంతో నడవాలినీవు."

## నాయకులు - పార్టీలు

జపాన్‌లో ముఖ్యమైన రాజకీయపార్టీలు 4-(1) మిన్‌సెయ్‌టో,(2) సెయూకేయ్, (3) షకేయ్ టెయ్‌షుటో (4) కొంకుమిన్ డోమె. 1940 వరకు ఈ 4 లో 2 పార్టీలు పేరుకైనా ఉంటూవచ్చాయి. కానీ ఆ సంవత్సరంలో మిన్ సెయ్‌టో పార్టీ-దానంతట దది—రద్దయిపోయింది. ఇప్పుడు జపాన్‌లో ఒక్కటేపార్టీ ఉంది-సెయూకేయ్. 1868లో 'చక్రవర్తి ఉద్ధరణ' జరిగిందిగాని 1890 వరకు ప్రజాస్వామ్య పద్ధతులు అమలులోకి రాలేదు. సెయూకేయ్ 1900 లో మిన్‌సెయ్‌టో 1927 లో ప్రారంభింపబడ్డాయి. ఈ రెండూ కూడ గుత్తవ్యాపారులచేతి కీలుబొమ్మలు. పూర్వాచార పరాయణులైన జమీందారులు, భూస్వాములు, ఆధునికులైన ధనికవర్గంతో చేతులు గలిపారు. రైతులకు, శ్రామికులకు వ్యతిరేకంగా ధనికవర్గంలోని రెండు చీలికలు-వాటిలో వైషమ్యమున్నా-తాత్కాలికంగా ఏకమైనై. విదేశ వ్యాపారంలో, వలసరాజ్యాల్లో ఆసక్తిగల్గిన మిట్సుయి కుటుంబానికి గాను సెయూకేయ్ పార్టీ పాటుబడుతూంది. భార పరిశ్రమలలో, సైన్యంలో ఈ పార్టీ పలుకుబడి హెచ్చు.

మిన్‌సెయ్‌టో పార్టీ మిట్సుబిషి కుటుంబానికిగాను కష్టపడుతూంది. ఈ పార్టీకి తేలిక పరిశ్రమలలో (కొనుగోలు వస్తు-వసతుల నుత్పత్తిచేసే పరిశ్రమలలో) నౌకాదళంలో పలుకుబడి హెచ్చు. సెయూకేయ్ కంటె మిన్‌సెయ్‌టో కాస్త అభివృద్ధికి పోరాడుతుంది.

సెయూ కెయ్ పార్టీ 1900 లో ఇటో రాకుమారునిచే స్థాపించబడ్డది. ఈ పార్టీ దేశాన్ని హమేషా యుద్ధానికి ప్రోత్సహించడంలో 'సుప్రసిద్ధ యుద్ధసమితి'కి ఏమాత్రం తీసిపోదు. ఈ పార్టీకి చెందిన హారా ప్రభుత్వం 1918-22 లో సైబీరియాను దండెత్తింది. 1920-5 లో సాఖలిన్‌ను ఆక్రమించింది. ఈ పార్టీకిచెందిన తనక ప్రభుత్వం 1927 లో షాంటుంగ్ ముఖ్యపట్టణమైన సినన్‌ఫూకు—ఛాంగ్ కే షెక్ సైన్యాలు ఉత్తర చైనాకు వ్యాపించకుండా అడ్డడానికి-సైన్యాల నంపింది. 1931 లో మంచూరియా యుద్ధాన్ని ప్రారంభించే సమస్యపై క్వాంటుంగ్‌లోని జపాన్ సేనానాయకులకు, జపాన్‌లోని (అప్పటి) మిన్‌సెయ్‌టో ప్రభుత్వానికి భేదాభిప్రాయా లొచ్చినప్పుడు సెయూకేయ్ పార్టీ అధికారాని కొచ్చింది.

మిన్‌సెయ్‌టో పార్టీ నాయకులు మఛిడ, యమమొటో, ఒగవ, వకాట్సుకి మొదలైనవారు. ఈ పార్టీకి ప్రతినిధుల సభలో 179 మంది సభ్యులున్నారు. పట్టణాల్లో, శ్రామికులలో ఈ పార్టీకి హెచ్చుపలుకుబడి వుంది. సెయూకేయ్ పార్టీకి గ్రామాల్లో ఎక్కువ పలుకుబడి. ఈ పార్టీ నాయకులు హటోయామా, మోషిజవ, కవముర, నకజిమ మొదలైనవారు. ఈ పార్టీకి ప్రతినిధుల సభలో 176 ప్రతినిధులున్నారు. షకెయ్ తెయ్‌షుటో (సోషలిస్టు) పార్టీకి ప్రతినిధుల సభలో 35 మంది ప్రతినిధు లున్నారు. ఫాసిస్టుపార్టీ అయిన కొకుమిన్ డో మెయ్‌కి 11 మంది ప్రతినిధులున్నారు.

## సైన్యం.

జపాన్‌లోని ధనికవర్గం, సేనానాయకులు, ఉన్నతోద్యోగులు—ప్రతి ఒక్కరుకూడా తమ అభీష్టసిద్ధికి మున్ముందు చక్రవర్తిపేరు నుపయోగించుకుంటారు. కేవలం వ్యక్తిగత స్వలాభంకోసం చేసేపనులైనా, లేక వారి వర్గాలలాభంకోసం చేసే పనులైనా తమ 'గొప్పదేశం'కోసమని, 'భగవత్స్వరూపుడైన చక్రవర్తి'కోసమని ముందు ప్రకటించి తర్వాతగాని కార్యసాధనకు పూనుకోరు. 'చక్రవర్తి మేలు' కోసం, లేక 'రాజమార్గం' అన డాన్నే జపాన్‌భాషలో 'కేడో' అంటారు. కేడో విధానాన్ని అతి భక్తివిశ్వాసాలతో ఆచరణలోకి తేవడంలో పేరు ప్రఖ్యాతుల బొందినవాడు జనరల్ సడావో అరాకి. జపాన్ సైన్యాలితడ్ని ఆదర్శపురుషుడుగా పూజిస్తున్నై. ఇతను జపాన్ ఆశయాల నీవిధంగా వర్ణించాడు—

"ఆసియాఖండంలో ముఖ్య బలం జపానే. అందుచేత ఆసియాఖండానికి తాను పెద్దగానుండి ఘోరయుద్ధానికి తయారుగావాలి. తెల్లజాతులు ఆసియా నివాసులను అమానుష హింసకు లోను చేస్తున్నారు. ఈ గర్వాన్ని అణచకుండా జపాన్‌సామ్రాజ్యం ఎంతకాలం ఊరకుంటుంది? ఇక ఒక్క—క్షణం ఊరుకోలేదు. మా సామ్రాజ్య మూల సిద్ధాంతం న్యాయం_ధర్మం. ఈ సామ్రాజ్యాన్ని స్థిరంగా, శాశ్వతంగా స్థాపింపతోడ్పడను జపాన్ ప్రజలందరు నైతికంగాను, భౌతికంగాను గూడా తయారై యుండాలి. అవసరమైతే దౌర్జన్యయుతంగా యీ ఘన కార్యాన్ని నెరవేర్చను సిద్ధపడాలి."

ఈవిధంగా ఆసియాఖండాన్ని ఉద్ధరించేలాగా తియ్యని మాటలుజెప్పి పాశ్చాత్యులమీద ద్వేషాన్ని రేకెత్తించి

తమకార్యాల సాధించుకుంటున్నారు జపాన్ నాయకులు. పాశ్చాత్యులు 'ఆసియాఖండవాసులపట్లచూపే అమానుష, అతిక్రూర, రంగు - జాతిభేదప్రచారాన్ని ఎదుర్కోను'—దానికి విరుపుడుగా—జపాన్‌వారొక కొత్తజాతి-వర్ణభేద ప్రచారాన్ని ప్రారంభించారు. 'ఆసియాఖండం, ఆసియావాసులకే' అని అమెరికన్ల నెక్కిరించను మరొక నినాదాన్ని ప్రారంభించారు. జపాన్‌సైన్యంలో యీ జాతిగర్వం మితిమీరి పోయింది.

జపాన్‌లో సైన్యానికున్న గౌరవం మరేవృత్తికి లేదు. పూర్వం జమీందారుల సొంతసైన్యాలలోనున్న సమూరేలు యీనాడు సైన్యోద్యోగులుగా నున్నారు. పేరు, ప్రతిష్ట, పలుకుబడిగల ప్రతినాయకుడు తనజీవితంలో ఎప్పుడో ఒకప్పుడు సైన్యంలో నౌకరుగానుండి యుంటాడు. జపాన్‌లో "దేశభక్తి సంఘాలు" చాలా ఉన్నాయి. అదిరించి, బెదిరించి తమ ఆశయాలకు అనువుగా ప్రభుత్వం నడిచేటట్లు చేయడం యీ సంఘాలకు సహజమైపోయింది. ఈ సంఘాల్లో హెచ్చుమందిసభ్యులు సైనికులే. అందువల్ల యీ సంఘాలను తమ పలుకుబడిలో నుంచుకోదలచుకొన్న వారల్లా సైన్యోద్యోగులుగాజేరి సైనికుల్లో పలుకుబడి సంపాదించ జూస్తారు. 1873 లో 'నిర్బంధ సైనిక శిక్షణచట్టం' ప్రతి పురుషుడు సైన్యంలో కొంతకాలం తరిఫీదుపొందాలని శాసించింది. అప్పటినుండి సైన్యపలుకుబడి అపారంగా హెచ్చింది.

నేడు జపాన్‌సైన్యంలో 50,00,000 తరిఫీదు బొందిన సైనికులున్నారు. ప్రపంచంలోని యితరసేనలకు ఏవిధంగాను

వీరు తీసిపోరు. చైనాయుద్ధంలోమాత్రమే 20,00,000 లకు తక్కువలేనిసైన్యం పాల్గొన్నది. జపాన్ నౌకాబలం ఇంగ్లండు, అమెరికాలతర్వాత ప్రపంచాధిపత్యాన్ని కల్గుంది. ఈ నౌకాబలానికి—9 యుదనావలు, 14 పెద్ద యుద్ధ ఓడలు, 24 తేలికైన యుద్ధఓడలు, 112 విధ్వంసక నావలు, 60 జలాంతర్గాములు, 6 విమాన వాహకనావలు ఉన్నాయి 1940 లో. ఇప్పటికి వీటిసంఖ్య అపారంగా పెరగకుంటే జపాన్ బ్రిటన్, అమెరికాలమీద యుద్ధాని కురకదు. దేశంలో సైన్యానికిగల బలాన్ని చక్కగా అవగాహన చేసుకోవాలంటే 'దేశభక్తి సంఘాలు' గురించి కొంత గ్రహించాలి. వానిలో ముఖ్యమైనవాటిని, పెద్దవాటినిగురించి గమనిద్దాం.

1. "మాజీ సైనికోద్యోగులసంఘం" 1895 లో స్థాపించబడ్డది. దేశభక్తి సంఘాలన్నిటిలోకి బలవత్తరమైనది. దీని సభ్యుల సంఖ్య 30,00,000 లకు మించతుంది. ఇందులో మాజీ సైనికోద్యోగుల సంఖ్య మాత్రమే-ప్రస్తుతం ప్రభుత్వాన్నుండి భరణం పుచ్చుకునేవారు-53,000. మాజీసైనికుల సంఖ్య 80,000. మిగత సభ్యులందరు ఏదోవిధంగా సైన్యంతో సంబంధం కలవారో లేక యీ సంఘ ఆశయాలకు తోడ్పడేవారుగానో వున్నారు. ఈ సంఘం కేవలం సైనిక సిద్ధాంతాలమీదే ఆధారపడి యుంది. నేటికి, రేపటికిగూడా యీ సంఘసభ్యులకు (సైనిక కట్టుబాట్ల ననుసరించి) రోజూ కవాత్ చేయడం, సంఘ అధిపతుల ఉత్తర్వులను శిరసావహించడం ఎలాగో నేర్చుకోడం, వ్యాయామక్రీడల్లో పందెముల్లో పాల్గొనడం నిత్యకృత్యాలై యున్నవి. ఇది దేశంలో సంగతి. ఈ సంఘం విదేశాల్లోకి తన గూఢచారులనుపంపి జపాన్‌కు లాభకరంగా కుట్రలు పన్నుతూంటుంది. మంచూరియా, కొరియా, మంగోలియాలలో బౌద్ధమత ప్రచారకుల వేషంతో యీ సంఘసభ్యులు పని

చేస్తూన్నారు. పశ్చిమోత్తర చీనాలోని చింఘేయ్, కన్సు రాష్ట్రాల్లో, లోపలి మంగోలియాలో, నింగ్‌షాషియా, సుయూఅన్, చహార్ రాష్ట్రాల్లో హెచ్చుగా మహమ్మదీయులున్నారు. వీరి ప్రభుత్వానికి (చైనా) విరుద్ధంగా వీరిలోని సెన్‌రో అన్న ముఠాద్వారా యీ సంఘం ప్రచారాన్ని సాగించుతూంది. ఈ సంఘానికి లోబడిన ఉప సంఘ మొకటుంది—"యువసంఘం".

2. "యువసంఘం" 13 25 నడిమి వయస్సుగల యువకులను తరిఫీదు జేస్తుంది. 1934 లో యీ సంఘ సభ్యుల సంఖ్య 24,00,000 యువకులు, 15,00,000 యువతులును. లింగభేదాన్ననుసరించి యీ సంఘంలో రెండు శాఖలున్నాయి. ఈ సభ్యుల జీవితంలో ప్రతిఅంశాన్ని ఈసంఘం తన యిష్టానుసారం నడుపుతుంది. షింటోమతంలో నమ్మకం హెచ్చితేగాని రాజభక్తి, దేశసేవ, యోధత్వం ప్రబలవని గుర్తెరిగి యీసంఘం తన సభ్యులను యాత్రల కెక్కువగా తీసుకెళ్తుంటుంది. జపాన్ ఆధిక్యతను గురించి యీసభ్యులకు నూరిపోస్తుంది. వీరికి అచ్చే సంస్కృతల్లా తమదేశానికి సాటిదేశం, తమతో సాటియైనప్రజలు, తమ చక్రవర్తికి మించినదేవుడు మరి భూమిమీద లేరని. ప్రతిపట్టణంలోను, కొన్ని గ్రామాల్లోను యీ సంఘానికి శాఖలున్నాయి. ఈ శాఖల మొత్తం 16,000. ఈ సభ్యులు సైనికుల్లాగా సదా క్రమమైన ఉడుపుల నే తొడుక్కుంటారు. వ్యాయామక్రీడల్లో, ముఖ్యంగా జిజిత్సు (జపాన్‌కుస్తీ), రెండుచేతుల కత్తినుపయోగించడం మొదలైనవానిలో వీరికి చక్కని తరిఫీదు నిస్తుంది.

ఇంత బలసంపన్నమైన "మాజీ సైనికోద్యోగులసంఘం" కేవలం కొద్దిమంది వ్యక్తుల స్వలాభంకొరకు కృషిచేస్తూంది. ఈ సంఘాలు రెంటికి మూలపురుషులు, నేటికి యీసంఘాలను తమ యిష్టానుసారం నడుపుతూన్నవారు జనరల్ అరాకి, మజాకి, మినామి, అడ్మిరల్ నొముర, కాటో, టొయ్‌డా మొదలైనవారు.

3. "యువ్వనోద్యోగుల సామ్రాజ్యసంఘం"లో సైన్యంలోని కొద్ది పాటి ఉద్యోగులు, అందున యువకులు, సామ్రాజ్యవిస్తరణకై ఏమైనా సరే వెనుదీయగూడదనే అతివాదులు సభ్యులుగా నున్నారు సైన్యంలో వీరే అతివాదులు; అతివాదులంటే సామ్యవాదులని గాదు. జపాన్ సైన్యంలో అతివాదులంటే కేవలం రాక్షసులనే అర్థం. ఈ సంఘ సభ్యులందరు రైతుబిడ్డలే. సైన్యంలో కొద్దిపాటి ఉద్యోగాలన్నీ రైతు బిడ్డలవే. అందువల్లే జపాన్‌లో శ్రామికవిప్లవం యిప్పట్లో వచ్చేట్లు కనబడదు. వీరు బహిరంగ పోటీపరీక్షల్లో ఉత్తీర్ణులైతేనే వీరిని సైన్యంలో చేర్చుకుంటారు. 1927 నుంచి సైన్యంలోని ఉన్నతోద్యోగాల్లో 20% వీరివే. కొద్దిపాటి సైనికోద్యోగాల్లో 85% రైతుబిడ్డలవే. ఈ సంఘం రైతు సైనికులపై ఆధారపడి యుండడంవల్ల ఒక్కొక్కప్పుడు రాజకీయపార్టీలకు, పెద్దపెద్ద గుత్తవ్యాపారసంస్థలకు విరుద్ధంగా పని జేస్తూంది. తమ దేశ సాంఘిక దురవస్థను చక్కగా అవగాహన చేసుకో లేక యీ సంఘప్రచారంవల్ల మోసపోయి "సామ్రాజ్య సోషలిజం"ను స్థాపిద్దామని యీసభ్యులు కోర్తున్నారు. వీరు ఉపపాదించే సామ్యవాదం మార్క్సిజం గాదు, సోషలిజం గాదు. ఇది "ఉద్యోగుల సామ్యవాదం" లేక "రాష్ట్రపెట్టుబడిదారీ" విధానం గావచ్చుగాని సామ్యవాదంమాత్రం కానేగాదు. ఈ యువక ఉద్యోగస్థులందరు దేశ భక్తులే. చక్రవర్తిపట్ల వీరి భక్తి అపరిమితం. 1932 లో యీ సంఘం ఒక కరపత్రాన్ని ప్రకటించింది. అందులో—

"జపాన్ సైనిక, నౌకాబలంయొక్క ఆత్మ, శరీరం రెండూగూడా ప్రజలతో లీనమైయున్నాయి. బుషిడో నీతిననుసరించే ఉన్నాయి, జాతీయదేశభక్తికి విరుద్ధంగా లాభాలు దోచుకుంటూన్న వ్యాపార మోసగాండ్రను నాశనంచేయాలి. రాజకీయ పార్టీలు మన జాతి అంతటికి విరోధులు—వాటిని రూపుమాపాలి. చక్రవర్తిగారి నాయకత్వం క్రింద మన సామ్రాజ్యతేజస్సును పునరుద్ధరించి స్వపరిపాలనను శాశ్వతంగా నెలకొల్పాలి."

4. "మాతృదేశ రక్షణసంఘం." ఈ సంఘాన్ని 'కొకొ దొసి కేయ్' అని పిలుస్తారు. కిరనుమ ప్రభువు దీనిని స్థాపించాడు. ఇతడు సెయూకేయ్‌పార్టీ నాయకుడు. మాజీ ప్రధాని. కొంతకాలం టోకియో విశ్వవిద్యాలయానికి అధిపతిగా నున్నవాడు.

5. "నల్లమహాసముద్రసంఘం"—దీనిని 'జన్ యోషా' అని పిలుస్తారు. పై సంఘాలన్నిటికన్నా మిన్నగా అభివృద్ధి నడ్డను యీ సంఘం పాటుబడుతూంది. అన్నిటిలోకి పురాతనమైన దిదియే, దీని నాయకుడు, నేటికి యీ సంఘానికి మార్గదర్శియైన మిటిట్సు టొయామా వయస్సిప్పుడు 87 ఏండ్లు. హింస నుపయోగించడంలో—అందున అమానుష హింసకు—పేరందినవాడు. ఈసంఘం ఇతరసంఘాలవలెగాక చాల రహస్యంగా పనిచేస్తూంది. సైనిక లెక్కవగా దీనిలో సభ్యులుగా నున్నారు. తన సభ్యులమూలంగా, తన శాఖలమూలంగా సామ్రాజ్యవాదయుద్ధాల నీసంఘం పురికొల్పుతుంటుంది. టొయామ శిష్యులు చాలమంది ఉన్నతోద్యోగాల్లో నున్నారు. వారిలో ప్రసిద్ధులు—

హిరొటా—మాజీప్రధాని, మాజీ విదేశాంగమంత్రి. ఇతను దేశంలోని పార్టీలన్నీ ఏకంగావాలని ఎంతో ప్రయత్నించాడు. జపాన్ ఫాసిస్టులలో అగ్రగామి. ఫాసీజానికి మూలపురుషుడు.

ఉఛిడ—1901 లో 'కొకురు యుకె' సంఘాన్ని స్థాపించాడు. దీనికే "అమూర్‌నదీ సంఘం" అనిపేరు. అమూర్‌నది రష్యా తూర్పు సరిహద్దుల్లో నుంది. ఈసంఘం రష్యాపట్లద్వేషాన్ని రేకెత్తించనే స్థాపించబడ్డది. ఇప్పటికీ పూర్తిగా ఆప్రయత్నంలోనే ఉంది.

6. "స్త్రీ దేశభక్తి సంఘం"—దీనిలో స్త్రీలమాత్రమే సభ్యురాండ్రు. ఇందులో ప్రస్తుతం 15,00,000 సభ్యురాండ్రున్నారు. ఈ సంఘానికి సహకారిగా మరో చిన్నసంఘం 'స్త్రీ రక్షణసంఘం' ఉంది. ఈ రెండు సంఘాలుగూడా స్త్రీలలో దేశభక్తి, ప్రభుభక్తి, దేశసేవ

మొదలైన సద్గుణాలను రేకెత్తించను పాటుపడుతున్నారుగాని, స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీల స్థితి, స్త్రీల ఆర్థిక హక్కులు మొదలైన 'నీచ ఆశయాలను' పాటుబడడం లేదు.* జపాన్ సామ్రాజ్యవాదాని కేది విరుద్ధంగా తోస్తే దాన్ని నీచ మంటున్నారు జపాన్‌వారు. కొంత కాలం ఆందోళన చేసిన తర్వాత .యిటీవల కొద్దిమంది స్త్రీలకు ఎన్నిక హక్కు నిచ్చారు.

## ఖూనీలు

జపాన్ సైనికోద్యోగులు తమ యిష్టప్రకారం ప్రభుత్వం నడుచుకోకపోతే ప్రజలతో సంబంధం లేకుండా ఆ ప్రభుత్వాన్ని వెళ్ళగొట్టే కొత్త మార్గాన్నొకదానిని కనిపెట్టారు. జర్మనీలో తప్ప మరెచ్చట ఈ దుర్నీతి అలవాట్లో లేదు. సమూరేల బుషీడో నీతి ఫలితమే ఈ దురలవాటు. సైనికోద్యోగుల మాట సాగనప్పుడు మంత్రులను ఖూనీ చేయ నారంభిస్తారు. ఒకొక్కప్పుడు తమ 'దేశభక్తి' సంఘాల నాయకులనే చిత్రవధ గావిస్తారు. ఈ అమానుషత్వంలో జపాన్ను ఏయితర దేశంతో పోల్చడానికి వీల్లేదు.

1930 ఆఖరులో జపాన్ ఆర్థిక దుస్థితికి లోనైంది. ఆ సమయంలో 'లండన్ నౌకా సంధి' కొప్పుకున్నందుకు అప్పటి మిన్‌సెయిటో ప్రభుత్వంలో ప్రధానియైన హామగుచిని సైనికోద్యోగు డొకడు గాయపరిచాడు. ఈ దెబ్బతోనే 1931 ఆగస్టులో అతను చనిపోయాడు. ఆ సైనికోద్యోగునకు మొదట మరణదండనను విధించారుగాని తర్వాత ఆ శిక్షను తొలగించి ఖైదుమాత్రం విధించారు. ఇందుకు కారణం

* ఇవి జపాన్ నాయకుల మాటలు.

అతడు దేశభక్తుడు కావడమే. రాజకీయ ఖూనీదార్లను ప్రజలు దేశభక్తులని పూజిస్తారు.

1932 ఫిబ్రవరి—మార్చి నెలల్లో షాంగైలో జపాన్ యుద్ధాన్నారంభించింది. ఈ యుద్ధం ప్రారంభమైన కొద్ది రోజులకు సైనికోద్యోగులు టోకియో నగర వీధుల్లో రెండు ఖూనీలు చేశారు. వీటి ఉద్దేశం ప్రజాస్వామ్యంపట్ల సైన్యానికి గల ద్వేషాన్ని వెల్లడించడమే. మిన్ సెయ్‌టో పార్టీ ప్రచారకుడు, మాజీ ద్రవ్య మంత్రి, మిట్సుబిషి గుత్తవ్యాపార సంస్థకు పెద్దగానున్న ఇవనాకి ప్రభువు అల్లుడయిన ఇనోయిని 9-2-1932 న చంపారు.

1931 డిసెంబరులో మిట్సుబిషి గుత్తవ్యాపార సంస్థ సహాయంతో మిన్ సెయ్‌టో పార్టీ అధికారంలో నుంది. ఈ ప్రభుత్వాన్ని మిట్సుయి గుత్తవ్యాపార సంస్థ సాయంతో సెయుకేయ్ పార్టీ ఓడించి అధికారాని కొచ్చింది. అధికారానికి రాగానే సెయూకేయ్ ప్రభుత్వం బంగారు నెగుమతి చేయకూడదని శాసించింది. అందువల్ల జపాన్ నాణెం-ఎన్-విలువ అంతర్జాతీయ బజార్లలో తగ్గింది. జపాన్ ఎగుమతి వ్యాపారం హెచ్చింది. అందువల్ల మిట్సుయి గుత్తవ్యాపార సంస్థ కొటానుకోట్ల రూపాయలు లాభం పొందింది. ఈ నాటకాన్ని గమనించారు సైనికోద్యోగులు. 5-3-1932 న టోకియో బజారులో మిట్సుయి గుత్తవ్యాపార సంస్థకు ప్రధాన డైరెక్టరయిన డన్ ప్రభువును ఖూనీచేశారు. ఈ హత్య మిట్సుబిషి ప్రేరణమీదే జరిగింది.

1934 డిసెంబరులో మికనో ప్రభువును, సియోంజి రాకుమారుడ్ని చంపాలని ప్రయత్నం జరిగింది. ఈ కుట్రకు నాయకుడు నెల 1 కి రూ 18 సంపాదిస్తూ వచ్చిన శ్రామికుడు—యువకుడు. 'అకోర్యాజుకు' అన్న పార్టీకి నాయకుడైన 'టచి బాన' ఈ ఖూనీలను ప్రోత్సాహిస్తూ యిలాన్నాడు—

"చక్రవర్తి పునరుద్ధరణ ఫలితాలు వృథాపోయాయి. ఇందుకు కారణం సట్సుమ-చోషు పరిపాలన మన పుణ్యభూమిని పెట్టుబడిదార్లకు అప్పగించడం. ఈ పెట్టుబడిదార్లు ప్రజలను, ప్రజలను మోసగించే రాజకీయవేత్తలను, ఆ రాజకీయవేత్తల చెప్పుచేతల్లోనుండే రాజకీయ పార్టీలను తమ స్వలాభాని కుపయోగించుకుంటున్నారు."

'దేశభక్తి సంఘాల'కు నాయకులైనవా రనేకులు సైనికులచే చంపబడ్డారు. ఈ నాయకులు చెప్పినట్లు సైనికులు, సైనికోద్యోగులు కొంతకాలం వింటారు సామ్రాజ్య విస్తరణ సన్నాహంలో ఈ 'దేశభక్తి సంఘాలు' నాయకులు కాస్త వెనకదీశారా, సైనికోద్యోగులు వెంటనే వారిని చెండాడ్తారు. ఒకమారు బుషీడోనీతికి మూలపురుషుడైన జనరల్ అరాకి ప్రాణానికి మోసమొచ్చింది. ప్రీవికౌన్సిల్ మాజీ అధ్యక్షుడు, సెయూకేయ్ పార్టీ నాయకుడు, 'కొకొకు దొసికై' సంఘ స్థాపకుడు నైన హిరనుమ ప్రభువునే చంప చూచారు. 1940 వేసవిలో అడ్మిరల్ యొనెయి ప్రభుత్వం త్రోసివేయబడ్డది. వెంటనే యొనెయిని చంప ప్రయత్నించారు సైనికోద్యోగులు.

15-5-1932 లో సెయూకేయ్ పార్టీ ప్రభుత్వంలో ప్రధానియైన ఇనుకేయ్‌ని చంపారు. ఇతర ప్రభుత్వోద్యోగు

లనేకులను చంపుతామని బెదరించారు. మిట్సుబిషి బాంకు, జపాన్ బాంకు, సెయుకేయ్, మిన్ సెయ్‌టో పార్టీల కార్యాలయాలు—మొదలైనవాటిమీద బాంబులు విసిరారు. టోకియోలోని విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాన్ని ధ్వంసంచేయ ప్రయత్నించారు. టోకియో పోలీస్ కేంద్ర కార్యాలయాన్ని రూపుమాపను ప్రయత్నించారు. ఈ నేరస్థులలో 4 గురికి 4 ఏండ్ల శిక్ష విధించారు. మిగతవారికి తలా 15 ఏండ్ల శిక్ష విధించారు. దేశమంతా వారిని 'మహావీరులు'గా పూజించింది. వారందరిని 1936 లోనే ఖైదునుండి వదలేశారు.

1936 ఫిబ్రవరి 26 న జపాన్‌లో ఘోరమైన అల్లరి జరిగింది. జపాన్‌లో రాజకీయ పార్టీలను, రాజకీయ నాయకులను, వారి మితవాద ప్రయత్నాలను ఎదుర్కొని—అడ్డి అభివృద్ధి నిరోధక శక్తులను తమ యిష్టానుసారం సైనికోద్యోగులు ఎలా నడుపుచున్నారని తెలుసుకోడానికి ఈ ఒక్క నిదర్శనం చాలు. 1932-36 లో మితవాదులధికారంలో నున్నారు. అందువల్ల వ్యాపారస్థులెక్కువ లాభాలు సంపాదించారు. ప్రీవీకౌన్సిల్‌లో, రాచకుటుంబంలో ఉద్యోగాలన్నీ మితవాదుల పరమైనవి. కోకి హిరోటా 1933 లో విదేశాంగ మంత్రిగా నున్నాడు. 1933 మార్చిలో జపాన్ నానాజాతిసమితినుంచి తన సభ్యత్వాన్ని మానుకుంటానని హెచ్చరిక నిచ్చింది. 1934 ఏప్రిల్‌లో 'ఆసియా ఖండం ఆసియావాసులకే' నని నూతన సిద్ధాంతాన్నొకదానిని జపాన్ లేవదీసింది. 1934 డిసెంబరులో 'వాషింగ్‌టన్

నౌకా సంధి'ని తాను రద్దుపరచినట్లు అమెరికా ప్రభుత్వానికి తెలియజేసింది. 1936 జనవరిలో 'లండన్ నౌకా సమావేశం'నుండి విరమించుకుంది. 1934 లో అప్పటి యుద్ధమంత్రియైన జనరల్ అరాకి బదులు జనరల్ హాయాషి నియోగింపబడ్డాడు. ఇతడు మితవాది. అయినా కూడా 1935 లో చహార్, హోపి ఆక్రమింపబడ్డాయి. ఆ దెబ్బలోనే సోవియట్ రష్యా సరిహద్దుల వరకు ఆక్రమిద్దామని క్వాంటంగ్ సైన్యాధిపతులు ప్రయత్నించారు గాని ప్రభుత్వ మొప్పుకోలేదు. ఈవిధంగా జపాన్‌లోని మితవాదులకు, సామ్రాజ్యవాదులకు ఘర్షణ యెక్కువైంది.

26-2-1936 న కొందరు సైనిక ఉన్నతోద్యోగులు, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు, రాజకీయ నాయకులు ఖూనీ చేయబడ్డారు. 25-2-1936 న 1,400 యువక సైనికోద్యోగులు,—వీరందరు 'యువ్వనోద్యోగుల సామ్రాజ్యసంఘం'లో సభ్యులే—మరికొందరు సైనికులతో టోకియో నగర వీధులను ముట్టడించారు. అప్పట్లో లార్డు ప్రీసీపిల్, మాజీ ప్రధానియైన అడ్మిరల్ సెయిటోను, ద్రవ్యశాఖా మంత్రియైన టక హాషిని, సైనిక విద్యా మంత్రియైన జనరల్ వతనాబెను చంపారు. అడ్మిరల్ సుజికికి గాయాలు తగిలాయి. మకినో ప్రభువు, సియోంజి రాకుమారుడు తప్పించుకెళ్ళారు. ప్రధాని అడ్మిరల్ ఒకాడను చంపబోయి, అతణ్నే పోలియున్న అతని బావమరదిని (కలనల్ మిట్సుఓ) చంపారు—అతడనుకొని.

'దేశభక్తి సంఘాలు' అన్నిటికి ధనికవర్గం ఉదారంగా

తంగా డబ్బిస్తూంది. సేనా నాయకులు, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు, రాజకీయవేత్తలు ఈ సంఘాలకు పెద్దలుగా నుండి వాటికి దారి చూపుతున్నారు. ఈ సంఘా లన్నిటిలో, ఈ సంఘా లన్నిటిద్వారా విదేశీయులపట్లను, రష్యనుల పట్లను, యిటీవలనుంచి యూదులపట్లను ద్వేషాన్ని రేకెత్తిస్తున్నారు. ఈ ప్రచారంవల్ల తమ సాంఘిక దురవస్థను మరచిపోయి కష్టజీవులైన సామాన్య ప్రజలకు గూడా విదేశీయుల ద్వేషించడం, యుద్ధాల కురకడం స్వభావమైపోయింది.

ఈ హత్యలన్నీ గూడా దౌర్జన్యయుతమైన సంఘాలను ప్రోత్సహించేవారికే సంబంధించి ఉన్నాయి. ఈవాళ హత్య చేయించిన నాయకుడే రేపు హత్యచేయబడడం సహజమైపోయింది. ఇన్ని 'దేశభక్తి సంఘాలు'న్నా దౌర్జన్యోద్యమం ప్రజల్లో వ్యాపించలేదు. సాంఘికదురవస్థ నిర్భరమైనప్పుడు ఈ హత్యలు ప్రారంభమౌతున్నాయి. ప్రజ లింత నికృష్టదశలో నున్నా జపాన్ నాయకులు మాత్రం తమ సాంఘిక విధానాన్ని మార్చ విముఖులుగా నున్నారు. ఈ 'దేశభక్తి సంఘాలు' అన్నిటి సభ్యత్వం జనాభాలో 6% అయినా ఉండదు. ఈ సభ్యుల్లోను దౌర్జన్యాన్ని స్వయంగా ఉపయోగించేవారి సఖ్య యింతో తక్కువ-బహుశ వీరిలో 1% ఉండొచ్చు. కానీ ఈ అల్పసంఖ్యాకులు చాలు, జపాన్‌ను ఫాసిజం ప్వాలు చేయను. వీరికి పలుకుబడి తక్కువ; లేకుంటే యిప్పటికి జపాన్ యింకెంతో రాక్షసంగా పరిణమించేది. ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవనం నికృష్టంగా నున్నప్పుడు, అందున ఏవిధమైన స్వాతంత్ర్యం వారికి

లేనప్పుడు విధిలేక వారు కార్యానికి తయారౌతున్నారు. జపాన్‌లో యిట్టి హత్యలు జరగడానికి కారణం ముఖ్యంగా ప్రజల దుర్భర దుస్థితే. మితవాదులైన రాజకీయవేత్తలను తమ అరచేతిలో నుంచుకొని జపాన్ విదేశాంగ విధానాన్ని తమ యిష్టంవచ్చినట్లు సేనానాయకులు సాగిస్తున్నారు. కొంతకాలం శాసనసభలను, ప్రజాప్రతినిధి విధానాన్ని బూటకంగా సాగించారు. కాని వారి గొంతెమ్మ కోర్కెలకు ఈ కొద్దిపాటి ప్రజాప్రతినిధి సంస్థలు గూడా అడ్డంకులుగా తోచినై. అందుకనే 1932 నుంచి క్రమేణా ఫాసిజాన్ని అమలులోకి దెచ్చారు.

---



సెయిటో దంపతులు.

1937లో సెయిటో వాషింగ్టన్‌లో జపాన్ రాయబారిగా నున్నాడు. 1937 డిసెంబరు ఆఖరువారంలో యాంగిట్సి నదిలో 'పానే' అన్న అమెరికను యుద్ధనావను జపాన్ వారు ధ్వంసం చేశారు. అమెరికా ప్రభుత్వానికి తమ అపచారాన్ని వెలిబుచ్చి యుద్ధం అప్పట్లో ప్రారంభం కాకుండా అడ్డగల్గాడు సెయిటో.



ఈ చిత్రంలో జనరల్ హిరోషి వోషిమా నాజీ ఉన్నతోద్యోగులతో నవ్వుచున్నాడు. ఇతడు 1941లో బెర్లిన్‌లో జపాన్ రాయబారిగానున్నాడు. జపాన్ యీయుద్ధంలోకి దిగాలని యెంతో ప్రయత్నించాడు. మట్సుక యీతని బలవంతంమీదే 1941లో ఇటలీ, జర్మనీ, రష్యాలకు యాత్రచేశాడు.

# 3. సంఘజీవనం.

## ప్రజలు.

అనేకజాతుల కలయికవల్ల జపాన్‌జాతి ఏర్పడ్డది. జపాన్‌దీవులను అనేకజాతులవారు దండెత్తివచ్చి స్థిరనివాసా లేర్పరచుకున్నారు. వీరందరిలో ఆసియాఖండం తూర్పు భాగాన్నుంచి వచ్చినవారు కొంత నాగరికులు. కొరియా, చైనా, మలయ, మంగోలియా, ఇండియా—మొదలైన జాతులరక్తం నేడు జపానీయుని ఒంటిలో నుంది. దీవులలో నివసించడంవల్ల యీ ప్రజలు కష్టజీవులు కావలసివచ్చింది. అప్పుడప్పుడు ఆసియాఖండంనుంచి, పసిఫిక్ మహాసముద్రము లోని దక్షిణదీవులనుంచి దండయాత్రలు సాగుతూనే ఉన్నం దున ఎప్పటికప్పుడు కొత్త రక్తం యీ ప్రజల్లో చేర్తూనే వుంది. క్రీ॥ పూ॥ 2-వ శతాబ్దంలో చైనాలో జమీందారి విధానం క్షీణించినందున ఆ జమీందారుల యోధులనేకులు బ్రతుకుదెరువుకోసం యీ దీవులనుచేరారు. వీరు అతి ధైర్య శాలురు, గొప్పయోధులు. వీనుంచే నేటి జపాన్‌జాతి పౌరుషవంతం కాగల్గింది.

పుట్టుకనుబట్టి జపాన్‌వారు చైనావారిలాగా పసుపు రంగు మనుష్యులు. చప్పిడిముక్కు, పొడవైన నుదురు, నల్లని వెంట్రుకలు, పొట్టిశరీరం, మాటలు మితం, ఎక్కువ పట్టుదల, వీరి ఆకార స్వభావాలు. దేశభక్తి, రాజభక్తి, తక్కువ మేధాశక్తి, హెచ్చు మొండిపట్టుదలగల ప్రజలు గనుక అధికారవర్గం వీరిని తన యిష్టంవచ్చినట్లుపయోగించు

కో గల్గుతూంది. కంటెదుట కనబడువస్తువులను-విషయాలను గ్రహించినట్లు వీరు ఉపమాన ఉపమేయాలను, అలంకారా లను గ్రహించలేరు. జపాన్‌పురుషుని సగటు ఎత్తు 5'-3" మాత్రమే. స్త్రీ ఎత్తు 4'-11" అంగుళాలు. వీరి శరీరాలు సమ ముకుపైన పొడవుగా వుంటై. ఈ పై భాగంతోపోలిస్తే వీరి కాళ్లు చాల కురచలనే అనాలి. వీరు ఎక్కువగా గొంతు కూర్చుంటారు. బహుశ కురుచ కాళ్లుండడానికి యీ అలవాటు కారణం గావచ్చు. స్త్రీల పాదాలకు చిన్నప్పటినుంచి పాద రక్షలేసి బిగిస్తారు. ఎంత వయస్సొచ్చిన ఆడదైనా, శరీర సౌష్టవం పూర్తిగానున్నా, పాదాలుమాత్రం చాల చిన్న విగా నుండడానికి యీ దురలవాటు కారణం. అందుచేతనే జపాన్ స్త్రీలు ప్రపంచంలోని యితరస్త్రీలవలె వడిగా నడవ లేరు.

జపాన్‌ప్రజలు—సైనికులు, ఫాసిస్టులు, సామ్రాజ్య వాదులు కాదుసుమా!—దయార్ద్ర హృదయులు. నవ్వులో వీరి కెంతో ఆనందముంది. ఆత్మహత్యచేసుకోడం వీరికి— ముఖ్యంగా విద్యార్థులకు, ప్రేమించినవారికి—సహజమై పోయింది. జపాన్ ప్రజలకు పునర్జన్మలో నమ్మకమెక్కువ. అందువల్లే పితృపూజ అలవాట్లోనుంది. వీరికి హాస్యరసాన్ని ఆనందించడంచేత గాదు. సహనశక్తి, శాంతస్వభావం ఎక్కువ. ఎంత అవమానాన్నయినా పదిమందిలో నున్న ప్పుడు అతి సహనంతో దిగమ్రింగగలరు. ప్రాణం మీఁది కొచ్చినా తమ ఉద్రేకాన్ని వెలిబుచ్చరు. ఎంతటి కష్టమైనా, ఎంతటి సుఖమైనా-చైనావారిలాగా-ధైర్యంతో చలించకుండా

ఎదుర్కొంటారు. ఈ శాంతస్వభావం జపాన్ జాతికి ముఖ్య గుణం. ఏ వ్యక్తిగాని పిరికివాడుగానుండడం అతి నీచగుణంగా చూస్తారు. చక్రవర్తిపట్ల, దేశంపట్ల, తన జాతిపట్ల భక్తి గౌరవాలు హెచ్చుగానుండాలని ఈతనిరక్తంలోనే నాటుకుపోయింది. రానురాను యీ భక్తి మూఢత్వంగా పరిణమించింది.

క్రీ॥ శ॥ 5_వ శతాబ్దంలో చైనానుంచి వ్రాయడం నేర్చుకుంది జపాన్. జపాన్ చరిత్ర అప్పటినుంచే వ్రాతమూలకంగా ఏర్పడ నారంభించింది. జపాన్‌వారి ప్రథమ గ్రంథం 'కొజికి' 712 లో రచియింపబడ్డది. ఈ గ్రంథలో చరిత్రెంతో, కథ ఎంతో నిర్ధారణ చేయుడానికి వీల్లేదు. ఇతరులను చూచి నేర్చుకోడంలో జపాన్‌వారతి నిపుణులు. బౌద్ధమతంతోపాటు 5-8 శతాబ్దాల్లో చైనా నాగరికత, సంస్కృతి జపాన్‌కు వ్యాపించినై. ఏ నాగరికతనైనా తమ పరిస్థితుల ననుసరించి సమన్వయించుకోడంలో అతి నిపుణులు వీరు. వీరి లిపి మన లిపిలా ఎడమనుంచి కుడివైపుకు వ్రాయబడక పైనించి క్రిందికి వ్రాయబడుతూంది.

593-628 లో సుయికొ రాణి మైనరుగా నున్నప్పుడు, ఆమె పోషణకర్తయైన షోటొ చైనా విద్యావిధానాన్ని, న్యాయశాస్త్రాన్ని, కళలను జపాన్‌లో ఆచరణకు దెచ్చాడు. చైనా సాంప్రదాయాలు చూచి అంతవరకు కుటుంబాలకు, ముఠాలకు యిచ్చిన ఆధిక్యత పోయి వ్యక్తుల కెక్కువ విలువ నివ్వ నారంభించారు.

18-వ శతాబ్దారంభంలో—ప్రపంచంలోని యితర దేశాలన్నిటివలెనే—జపాన్‌లో సంస్కృతి కొంత అభివృద్ధి చెందింది. సాహిత్యం, వాఙ్మయం, చరిత్ర, వైద్యం, భూగోళ శాస్త్రం, యుద్ధ శాస్త్రం మొదలైనవి హెచ్చు శ్రద్ధతో ధనికులు చదువ నారంభించారు. ఈ కాలంలో ఏర్పడ్డ విజ్ఞులును, వారి సంతతివారును జమీందారీపిధానానికి ప్రబల విరోధులయ్యారు.

జపాన్‌లో వ్యక్తిగత జీవనానికి చోటులేదు. అవిభాగ కుటుంబ జీవనమే సర్వసామాన్యంగా నుంది. పాశ్చాత్య దేశాల్లోవలె భార్య, భర్త, పిల్లలున్నంత మాత్రాన కుటుంబ మనిపించుకోదు జపాన్‌లో. అన్నదమ్ము లందరూ ఏకంగా ఉండి వారి పుత్ర, పౌత్రులు కూడా ఆ యింటనే నివసిస్తేనే కుటుంబ మనిపించుకుంటుంది. ఇందుకు కొంతవరకు షింటో మతమే కారణమనాలి. షింటో మతంలో ముఖ్యమైనకర్మకాండ పితృపూజ. జపాన్‌లో వృత్తులు-మనలాగా-తండ్రినుండి కొడుకులు నేర్చుకోడంవల్లే కలుగుతున్నాయి. ప్రతి వ్యక్తికి, ప్రతి కుటుంబానికి రెండు ముఖ్యాశయా లున్నాయి—(1) కుటుంబ గౌరవాన్ని నిలబెట్టడం, (2) కుటుంబాన్ని అభివృద్ధిపరచడం-వీలైనంతమంది పిల్లలను గనడం. ఆస్తి తండ్రినుంచి కుమారులకు సంక్రమిస్తుంది. ఆడపిల్లలకు ఆస్తి హక్కులు లేవు. జపాన్ ప్రజలు ఎక్కువ మాంసాహారులు కారు. ఇందుకు బౌద్ధమతం కొంతవరకు బాధ్యురాలు. జల పుష్పాలు లేనిది వారికి ముద్ద మింగుడు బడదు. పూలన్నా, పూలచెట్లన్నా, తీగలన్నా, చెట్లన్నా వారి కెక్కువ ప్రేమ. అం

దుకనే జపాన్ భూభాగంలో సగపాలు నేటికీ అరణ్యమయమై యుంది. ప్రకృతి అంటేనే జపాన్ వారికి చెడ్డ పిచ్చ. దేశంలో జనాభా అపారంగా పెచ్చుతూన్నా, ఇతర దేశాలకు వలస పోవడానికి మంచి అవకాశాలు దొరికినా మాతృదేశాన్ని వదలిపోవడం వారికి మనస్కరించదు. వారి జీవితం-వారి దేశం ఈ రెండూ ఒకటే. వారి ముఖ్య పండుగలు అడవుల్లో ఎక్కడో నున్న దేవుళ్లను పూజించడమే.

జపాన్ వారి దైనందిన జీవనం చాల చిత్రంగా ఉంటుంది. పేదల జీవితానికి, ధనికుల జీవితానికి ఏమాత్రం పోలిక లేదు. పేదల జీవితం దుర్భరం. ప్రతి వ్యక్తి-పురుషులు మాత్రం-10 ఏండ్లు దాటితే ప్రతిరోజూ ఉదయం 5-30 గం॥లకే లేవాలి. 6-7 గంటల మధ్య వ్యాయామ శిక్షణలో పాల్గొనాలి. ఈ శిక్షణ రేడియోద్వారా, ప్రతి గ్రామంలో ప్రతి పట్టణంలో ఇవ్వబడుతుంది. మొదటి ½ గంట డ్రిల్లు అయిన తర్వాత రెండవ ½ గంటసేపు ప్రముఖ రాజకీయ నాయకుల ఉపన్యాసాలు వినాలి. 7 గంటలు కొట్టనిది వ్యాయామ శిక్షణ శిబిరం వదలి వెళ్ళడానికి వీల్లేదు. ధనికులు ఈ శిక్షణనుండి తప్పించుకోడానికి వీలుంది. ఈ శిక్షణ పూర్తికాగానే యింటికొచ్చి, చద్ది తిని 8 గంటలకు ప్రతి పురుషుడు పనికెళ్తాడు. అంతటితో మళ్ళీ రాత్రి 10 గంటలకే యింటికి రావడం. ఇంట్లో చాప తప్ప మంచం, పరుపులైనా నోచుకోడు శ్రామికుడు. అతని భార్య ఉదయం 8 గంటలకు తాను చెమటగార్చి, కూలీ సంపాదించను పోతుంది. రాత్రుల తన భర్తకంటే రెండు గంటలు ముందే యింటికొస్తుంది. వంట

చేసి భర్తకోసం—తాను తినకుండా ఎదురుచూస్తుంటుంది. ఇది పేదకుటుంబాల నిత్యజీవనం. ఇట్టి నిరుపేద కుటుంబాలను మతగురువులు పండుగలప్పుడు, పర్వాలప్పుడు వీలైనంత దోచుకుంటుంటారు.

1923 భూకంపానికి ముందు జపాన్‌లో యిండ్లన్నీ కొయ్యతో, కాగితాలతో కట్టబడేవి. ఈ భూకంపంవల్ల టోకియో, యోకోహామా నగరాలు పూర్తిగా ధ్వంసమైనవి. ఈ రెండు పట్టణాలను 1925 లో సిమెంటు, ఇటికెతో కట్టారు. జపాన్‌లోని గ్రామాలు నేటికి 1,000 ఏండ్ల క్రితమున్నట్లె ఉన్నవి. నగరాలు మాత్రం మార్పుచెందుతూనే ఉన్నాయి. 10,00,000 లకు ఎక్కువ జనాభా గల నగరాలు జపాన్‌లో రెండే వున్నాయి-టోకియో 49,70,839; ఒకాసా 24,53,573.

జపాన్‌వారు మనకంటే ఎన్నో రెట్లు ఎక్కువ రేడియోల నుపయోగిస్తారు. కానీ వారు యితర కేంద్రాల నుండి వచ్చే వార్తలను వినడానికి వీల్లేదు. ఎంతసేపటికి టోకియో, ఒకాసా—ఈ రెండు కేంద్రాల కార్యక్రమాన్నే వినాలి. ప్రొద్దున వ్యాయామ శిక్షణప్పుడు, రాత్రుల విశ్రాంతి సమయంలో తప్పకుండా కనీసం ½ గంటసేపు మిలిటరీ బాండు రేడియోద్వారా వినిపింపబడుతుంది. రేడియోలో జపాన్ ఔన్నత్యం, జపాన్ సామ్రాజ్యభోగట్టా, జపాన్ చక్రవర్తి ప్రతిభనుతప్ప వేరు కార్యక్రమాలుండవు. అప్పుడప్పుడు జపాన్ సైనికబలంప్రతిభను, నౌకాబలంనిపుణత్వాన్ని, విమానబలం సాహసాన్ని రేడియో పొగడ్తూంటుంది.

ధనికులు అతిథులపట్ల చాల గౌరవం చూపెడతారు. ఇంటికి అతిథివచ్చినా, ఆతనికి ఆహారంగాని, పానీయంగాని అందించినా వేనక్కాళ్ళమీద కూర్చొని మూడుసార్లు నొసటిని నేల కానిస్తారు. మనలాగా జపాన్ ధనికులు చేతులతో భోంచేయరు. రెండు పుల్లలసాయంతో భోంచేస్తారు. తేనీరు జపాన్‌వారికి చాల యిష్టమైన పానీయం. సాకీ ప్రజలందరికి ప్రియమైన మత్తుపానీయం. దీనిని బియ్యంనుంచి తయారు చేస్తారు. ధనికులయిండ్లలోని స్త్రీలకైనా ఘోషా లేదు. కాని పరపురుషులతో మాట్లాడరు. వారి ముందరిండ్లలో ఒక్కటే ఒక పటం-బొమ్మగాదు, చిత్రలేఖనమే-వారి చిన్న మేజాబల్ల మీద ఒక్క పువ్వుమాత్రమే ఉంటాయి. మన యిండ్లలో, ముఖ్యంగా మన వర్తకులిండ్లలో గోడలమీద అంగుళం చోటైనాలేకుండా రవివర్మపటాలు, చౌకబొమ్మ కాలండర్లు, సినిమా నటీమణులబొమ్మలు, పెద్దబ్బాయి సైకిల్‌మీద కూర్చొని తీయించుకున్న ఫోటోలు మొదలైనవి నిండిపోతై.

దుస్తుల విషయంలో, నాటకాల్లో జపాన్‌వారి అలవాట్లలో యిటీవల చాలా మార్పులొచ్చినై. హెచ్చుగా, ధనికులు పాశ్చాత్యుల అలవాట్లననుకరిస్తున్నారు. వారు సాధారణంగా చాపలమీద కూర్చుంటారు. వారి ముందరిండ్లలో కుర్చీలుగాని, బల్లలుగాని, మేజా బల్లలుగాని ఉండవు. వారెప్పుడుకూర్చున్నా మోకాళ్ళు ముందుకొచ్చేట్టు కాళ్ళు మడతవేసుకొని కూర్చుంటారు. మనవలె పద్మాసనం వేసుకోరు.

జపాన్ కవిసార్వభౌముడైన నోగొచి నేటికళాభివృద్ధి నిగురించి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు—

"నిజంలో మాకు (జపాన్‌వారికి) తెలుసుకోవాలన్న యిచ్ఛ నశించి పోయింది. అందువల్లే మేము కళలలో నూతనత్వాన్ని సృష్టించ లేకుండా ఉన్నాం; కొత్తమార్గాలను కనిపెట్టలేకుండా ఉన్నాం. కేవలం యితరులు చేసినట్లు (చూచి) చేయడం మాకలవాటయిపోయింది."

"జపాన్‌లో జీవితానికి కళలకు సంబంధంలేదు."

నేటి జపాన్‌లో సుప్రసిద్ధ చిత్రకారుడైన షైక్ వన్ చిత్రలేఖనాన్ని గురించి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడీ విధంగా...

"మాకు (జపాన్ చిత్రకారులకు) కల్పనాశక్తిలేదు. మేము సృష్టించ లేము, యోచించను లేము. ఒకవిషయాన్నే మళ్ళీమళ్ళీ యోచించడం మా కలవాటైపోయింది. మా కళలు యింకా సంపూర్ణతను చెందలేదు. భావాలకు యింకా భారతదేశానికేసి చూస్తున్నాం."

## విద్య

1871 లో నూతన విద్యావిధానం ప్రారంభమైంది. 'బలవంత జాతీయవిద్య' 1871 లో అమలులోకొచ్చింది. ప్రభుత్వం సాలీనా విద్యావ్యాప్తికి రూ. 6,00,00,000. ఖర్చు చేస్తూంది. ఇతరసంస్థలు—జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, యితర స్థానిక స్వపరిపాలనాశాఖలు—1923 లో విద్యావ్యాప్తికి మొత్తం రూ. 52,50,00,000 వెచ్చించినై. ప్రతి బిడ్డ—స్త్రీ, పురుషభేదం లేకుండా—6 వ ఏడు రాగానే బడి కెళ్ళాలి. 6 ఏండ్లు పూర్తిగా చదువుకోవలసిందే. మధ్య

చాలించడానికి వీల్లేదు. ప్రస్తుతం జపాన్‌లో నిరక్షరాస్యులు లేనేలేరు. పిల్లల జీతాలిచ్చుకోవాలి. సాలీనా గ్రామాల్లో సుమారు రూ 4/- పట్టణాల్లో సుమారు రూ. 8/- చొప్పున పిల్లల జీతాలు కట్టాలి.

1924 లో ప్రాథమికపాఠశాలలు 26,000 ఉన్నాయి. ఇవిగాక శిశు పాఠశాలలు—3-7 ఏండ్ల పిల్లలకు విద్యగరపేవి—801 ఉన్నాయి. వీనిలో 66,687 మంది పిల్లలున్నారు. మాధ్యమికపాఠశాలలు 491 ఉన్నాయి.

ఆడపిల్లలకు ఉన్నతపాఠశాలలు ప్రత్యేకం. వీటిసంఖ్య 1924 లో 746. వీనిలోని విద్యార్థినులసంఖ్య 2,71,375. అదేసంవత్సరంలో 98 ట్రైనింగ్‌స్కూళ్ళు, 6 విశ్వవిద్యాలయాలున్నాయి. పాఠశాలల్లో మతబోధన లేదని పేరుగాని ప్రభుభక్తి అపారంగా బోధించబడుతూంది.

## మతం

**షింటో మతం :**

జపాన్‌లో తరతరాలుగా అలవాట్లోనున్న మతం షింటోమతం. ఈ మతానికి, అన్నిమతాల్లాగే దేవుళ్లు, గుళ్ళు ఉన్నాయికాని యీ మతస్థుల కర్మకాండలో ముఖ్యమైనది పితృదేవతాపూజ. జపాన్ ప్రజలు తమ పర్వతాలను, వనాలను, అడవులను, పూలను, రాళ్ళను, నదులను పూజిస్తారు. మనలో కొందరు తిరుపతి ఏడుకొండలవాణ్ణి పూజిస్తూన్న భక్తికన్నా హెచ్చుభక్తితో వారు ఫ్యూజియామా మొదలైన పర్వతాలను పూజిస్తున్నారు. అగ్నిపర్వతాలవలన

అపాయం ఎక్కువవడంవల్ల వాటినే ఎక్కువభక్తితో పూజి స్తున్నారు. మూఢభక్తిలో మనల మించిపోయారు జపాన్ వారు.

జపాన్ సామ్రాజ్యస్థాపనతో ప్రారంభమైంది షింటో మతం. ఈ మతగురువు అవతారపురుషుడైన చక్రవర్తే. ఈ మతానికి సంబంధించిన గుళ్ళు, గోపురాలు లెఖ్ఖలేనన్ని ఉండేవి. 1872 లో ప్రభుత్వం విగ్రహారాధనను నిషేధించి నందున దేవాలయాల్లోని లింగాలనేకం తీసివేయబడ్డాయి. కానీ యీనాడు లింగపూజ మళ్లీ యథాప్రకారం సాగుతూనే ఉంది—ముఖ్యంగా గ్రామాల్లో. ప్రతిసంవత్సరం వరికోతల రోజుల్లో ప్రతిరైతు టగట్ దేవాలయంలోని 'బియ్యం దేవుడ్ని' పూజిస్తాడు—మనం అన్ని ప్రయత్నాలకు ముందు వినాయకుడ్ని పూజిస్తున్నట్లు. ఇదేవిధంగా ఒక్కొక్కపనికి-ప్రారంభించేముందు—(ప్రత్యేక) దేవుడ్ని పూజిస్తారు. 1872 లో ప్రభుత్వం లింగపూజను నిషేధించినాగూడా యిప్పటికీ విగ్రహారాధన గ్రామాల్లో హెచ్చుఆచరణలో నుండడానికి కారణం ప్రభుత్వచట్టానికి ప్రజల ఆచరణలకు సంబంధం లేక పోవడమే.

దేవాలయాలకెళ్లి విగ్రహాలనుపూజిస్తే రోగాలు నయమౌతవన్న మూఢనమ్మకముంది జపాన్ ప్రజలకు. వేనవేలు లింగాలను, చిన్నచిన్న రాతివిగ్రహాలను, ఇతర పూజాపదార్థాలను జపాన్ బజార్లలో అమ్ముతునే ఉన్నారు. షింటో మతానికి చక్రవర్తిపూజ హృదయంవంటిది. షింటోమతంలో మొదటిదేవత సూర్యుడే. తర్వాత చక్రవర్తి. ఇప్పటికీ మెయి

జిల్లాలో ఇసి అన్న గ్రామంలో అమటెరాసు-మికామిని పూజించను పెద్ద దేవాలయముంది. జపాన్‌లో దేవాలయాలన్నీ ప్రభుత్వం సొమ్మే.

మనలో హిందువులు సాధారణంగా 'ధర్మం' అన్న పదాన్ని ఏ అర్థంలో ఉపయోగిస్తారో అదే అర్థంలో షింటో మతస్థులు 'బుషిడో'అన్న పదాన్ని వాడుతున్నారు. 'బుషిడో' వారి నీతి. అది వారిధర్మం. ఈనీతి ఫలానప్పుడు, ఫలాని విధంగా ఆచరణలోకి వచ్చిందని చెప్పడానికి వీల్లేదు. దీని నిజరూపాన్ని నిర్ణయించడానికైనా వీల్లేదు. ఒక దృష్టితో చూస్తే దీనికి రూపమేలేదని చెప్పాలి. సమూరేలతో ప్రారంభమై యీనీతి యీనాడు ప్రజాబాహుళ్యాన్నంతటిని ఆవరించింది. జపానీయుల నేటి ఐక్యతకు చక్రవర్తి తర్వాత 'బుషిడో'యే కారణమనాలి.

మానవుని ఆధిక్యతకు కారణం అతని ఆత్మ. అట్టి ఆత్మను కలిగుండి, రక్షిస్తున్నందుకు శరీరాన్ని పోషించాలి. ప్రతివ్యక్తి తన మనశ్శరీరాలను తన అధికారంలో, కట్టుబాట్లో నుంచుకోవాలి. సంఘం మేలుకోసం ప్రతివ్యక్తి ఎంతటి త్యాగాన్నయినా చేయాలి. ఇవే 'బుషిడో' యొక్క ముఖ్యాశయాలు. స్వార్థం ఏమాత్రంలేకుండా తన్ను తాను మరచిపోయి సంఘసేవలో—చక్రవర్తి, దేశం మేలుకోసం—నిమగ్నుడవడమే 'బుషిడో' కర్మం. ఈ నియమాలు వ్రాతమూలకంగా లేవు. కానీ ప్రతివ్యక్తికి యివేమిటో తెలుసు. ఈనీతిని దాటితే ఎంతటివాడైనా సంఘదూషణకు లోనౌతాడు. అట్లని ప్రజలందరు సత్ప్రవర్తనులని గాదు. కాని

'బుషిడో' అనుచరణకారణంగా స్వార్థాన్ని మరచిపోయి నేటి జపాన్ సంఘమంతాకూడా (తాత్కాలికంగా) ఏకోన్ముఖం గా పాటుపడుతోంది.

బుషిడో అంటే యేమిటో స్పష్టపరచడానికి మరో మార్గముంది. పాశ్చాత్యదేశాలలోని—రష్యా మినహా— జీవితవిధానానికి కేవలం విరుద్ధమైనది బుషిడో. సంపదకన్నా పేదరికాన్నే సద్గుణంగా భావిస్తోంది. ఆడంబరానికిబదులు విధేయతను అవలంబించమంటుంది. కలసిమెలసి ఉండడానికి ముందు బిడియపడ్డం నేర్చుకోమంటుంది. స్వార్థంబదులు స్వార్థత్యాగాన్ని, తన క్షేమంబదులు దేశక్షేమాన్ని దృష్టిలో నుంచుకోమంటుంది. ప్రాణంపోతున్నా విరోధికి వీపుచూపని ధైర్యాన్ని ప్రేరేపిస్తోంది. అవమానానికంటే చావే మేలంటుంది. అందుకనే జపాన్‌వారు నేడు మృత్యువును నిర్లక్ష్యంగా ముఖాముఖి చూస్తున్నారు. (మసిషీ-టార్పెడో లే యిందుకు ఋజువు.) అధికారిపట్ల అణకువ, వ్యక్తుల-కుటుంబాల ఆసక్తులను సంఘశ్రేయస్సుకొరకు త్యజించడం, మనస్థిమితత, శరీరధార్ఢ్యం, ధైర్యం, క్షాత్రం, నిశ్చలత, ఓర్పు, కృతజ్ఞత మొదలైన సద్గుణాలు బుషిడోవల్లనే జపాన్ ప్రజల కబ్బినై.

కాని, యీ సద్గుణాలన్నిటిని యీనాడు అధికారవర్గం-సైన్యం తన దురాక్రమణ కుపయోగించి యితరప్రాదేశాల ప్రజారక్తాన్ని పీల్చను, చైనా, కొరియా. మలయ, జావా, ఇండో-చైనా, బర్మా ప్రజల చెండాడను ఉపయోగిస్తోంది. ఈ రాక్షసత్వం ఎంతకాలం సాగుతుంది?

బౌద్ధ మతం:

క్రీ॥ త॥ 552లో బౌద్ధమతం చైనానుంచి జపాన్‌కు వ్యాపించింది. బౌద్ధమతానికి షింటోమతానికి ఎన్నో వ్యత్యాసాలున్నాయి. బౌద్ధమతమే షింటోకన్నా మేలైనది. సర్వ భూతాలు సమానమన్న నీతిని షింటోమత మెరుగదు. చైనా నుంచి బౌద్ధమతం ద్వారా కొత్తనీతి జపాన్‌కొచ్చింది. అంతే గాదు, చైనా, భారతదేశాల సంస్కృతి, నాగరికతలనుగూడా యీ మతమే జపాన్‌కు దెచ్చింది. ఆసియాఖండానికి, జపానుకు యీ సంపర్కాన్ని కలగజేయడంలో కొరియా భాష ఎంతో సాయపడ్డది.

మొదటినుంచికూడా కొందరు జపాన్ ప్రజలు బౌద్ధ మతాన్ని ద్వేషిస్తూనే వచ్చారు. క్రీ॥ త॥ 540—571 లో చక్రవర్తిగానున్న కిన్ మయి అప్పట్లో కొరియారాజైన కుదార నుంచి చక్కని బుద్ధదేవుని విగ్రహాన్ని, కొన్ని బౌద్ధ గ్రంథాలను పుచ్చుకున్నాడు. షింటోమత గురువులిందుకు అధిక్షేపించారు. అప్పట్లో ప్రధానియైన సోగా చైనా, భారత దేశాలు పూజిస్తూన్న దేవుడ్ని జపాన్‌వారు పూజించడంలో తప్పేమిలేదని నచ్చజెప్పాడు. దేశంలో కొంత అల్లరి జరిగింది. చక్రవర్తి భయపడి ఆ లింగాన్ని సోగాకు బహూకరించాడు. సోగా ఒకగుడిని కట్టించి అందులో యీ బౌద్ధలింగాన్ని ప్రతిష్ఠించాడు. కొద్దిరోజులకు దేశంలో వ్యాధులు వ్యాపించి జననష్టం కలిగింది. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని షింటోమత గురువులు ఈ వ్యాధులన్నిటికి ఆ బౌద్ధ లింగమే కారణమని ప్రచారాన్ని ప్రారంభించారు. ప్రజలు

మూఢులుగనుక సమ్మి ఆలింగాన్ని నదిలోపారేసి దేవాల యాన్ని ధ్వంసంచేశారు. కొద్దిరోజులకు రాజుగారి నగరు మీద పిడుగుపడి, బౌద్ధవిగ్రహాన్ని దేశంలోకి రానీకూడదని పోట్లాడిన యిద్దరు మంత్రులు మరణించారు. వెంటనే మూఢ ప్రజలు బౌద్ధవిగ్రహాన్ని నదిలోనుండి తెచ్చి కొత్తదేవాల యాన్నొకదాన్ని కట్టి అందులో ప్రతిష్ఠించారు.

572—85లో చక్రవర్తిగానున్న బిదాత్సు పరిపాల నప్పుడు మరికొన్ని బౌద్ధవిగ్రహాలను, బౌద్ధమత పూజావిధా నాన్ని, అందుకు కావలసిన సామగ్రిని, బౌద్ధ సిల్పులను, సన్యాసులను, బిక్షులను, బౌద్ధదేవాలయ నిరాత్మలను చైనా, కొరియాలనుండి జపాన్‌కు పిలిపించారు. తద్వారా బౌద్ధమతం పాతుకుపోయింది దేశంలో.

593—628లో సుయికో రాణి మైనరుగానున్నప్పుడు ఆమెపోషకుడైన షొటొకొ బౌద్ధమత వ్యాప్తిని ఎన్నోవిధాల ప్రోత్సహించాడు. విద్యావ్యాప్తినిగూడా ఎక్కువ చేశాడు. చైనాలోని విద్యావిధానాన్ని, న్యాయశాస్త్రాన్ని, కళలను జపాన్‌లో ఆచరణకు తెచ్చాడు.

కొంత కాలమయ్యేప్పటికి షింటో, బౌద్ధమతాల వైష మ్యం రూపుమాసిపోయింది. షింటో మతగురువులుగూడా బుద్ధుని తమ దేవుళ్లతోపాటు మరో అవతారంగా పూజించ మొదలెట్టారు. ఈవిధంగా షింటోమతం జపాన్‌లోని బౌద్ధ మతానికి వ్యక్తిగత దేవుళ్ళను సమకూర్చింది. 573లో బౌద్ధ మతం జపాన్‌మతంగా చట్టరీత్యా అంగీకరించబడ్డది.

సుయిూకో చక్రవర్తికాలంలో 46 కొత్త బౌద్ధదేవాలయాలు కట్టబడినై. ఈదేవాలయాల్లో నౌకరి చేయడానికి 815 పూజారులు, 569 భిక్షువుల నియమింపబడ్డారు.

బౌద్ధమతంవ్యాపించినా జపాన్‌లో జాతీయఐక్యతమాత్రం ఏర్పడలేదు. పలుతెగలమధ్య పోరాటాలు సాగుతూనే ఉన్నాయి. కానీ బౌద్ధమతం ఆచరణలో ఉంటూనేవచ్చింది. 1868లో చక్రవర్తి మళ్ళీ అధికారానికి రాగానే పూర్వపు షింటోమతాన్ని పునరుద్ధరించారు.

నేటి జపాన్‌లో బౌద్ధమతం నామమాత్రంగా నుంది. షింటోమతం, బౌద్ధమతం కొన్ని శతాబ్దాలుగా కలిసిపోయినందున యీవాళ వీటిని వేరుపరచి చెప్పడానికి వీల్లేకుండా వుంది. జపాన్‌లో బౌద్ధులు మాంసాహారులే. ఇప్పటికి మూఢత్వానికి, మోసానికి షింటోమతంలాగే బౌద్ధమతం గూడా గొప్ప (చెడ్డ)పేరు సంపాదించింది. నేడు జపాన్‌లో 7,314 బౌద్ధదేవాలయాలు, 35,029 చిన్నగుళ్లు ఉన్నాయి. మతగురువుల సంఖ్య 54,000. ఈ దేవాలయాల పూజారులు కేవలం అవి నీతిపరులేగాకుండా జూదగాండ్రు, తాగుబోతువారుగాగూడా ఉన్నారు. మనదేశంలోలాగే యీ దేవాలయాలన్నిటికి సొంత ఆస్తులపారంగా ఉన్నాయి. ఆ ఆదాయాలకు తోడు ప్రతిరోజూ పూజాసమయంలో కొంతడబ్బు జమౌతుంది. ఈ డబ్బునంతటిని యీభగవద్భక్తులైన పూజారులు భోగలాలసత్వానికే వెచ్చిస్తున్నారు.

1928లో ప్రభుత్వం బౌద్ధదేవాలయాలు సక్రమంగా నడుస్తున్నవా? లేదా? అని పరీక్షించడానికి ఇనోడా అధ్య

త్వత్రకింద నొక విచారణసమితిని ఏర్పాటుచేసింది. ఈ విచారణనుబట్టి యీ బౌద్ధమత గురువుల నీచత్వం చాలా బైట బడ్డది. వీరందరు 'మహాయాన' శాఖకు చెందినవారు. నేడు జపాన్‌లో బౌద్ధమతావలంబకుల సంఖ్య–యిది కేవలం ఉజ్జాయింపే–4,60,00,000.

క్రైస్తవమతం:

1549 లో ఫ్రాన్సిస్ జేవియర్ అన్న క్రైస్తవమత బోధకుడు జపాన్ కొచ్చి తన ప్రచారాన్ని ప్రారంభించాడు. కొద్దిమంది బీదలు మతం పుచ్చుకున్నారు. 1587 లో ప్రప్రథమంగా క్రైస్తవులను హింసించ నారంభించారు. 1589 లో హిడెయోషి చక్రవర్తి క్రైస్తవమత బహిష్కారశాసనాన్ని శాసించాడు. 1622–24 లో క్రైస్తవులను హింసించ నారంభించారు. 1638 లో పోర్చుగీస్‌వారిని జపాన్‌నుండి తరిమివేసి క్రైస్తవమతాన్ని రూపుమాపారు. మళ్ళీ 1864 నుంచి తీవ్రమైన క్రైస్తవప్రచారం ప్రారంభమైంది. నాగసకి ప్రాంతంలో కొంతమంది జపాన్ క్రైస్తవులున్నారు. వీరు కొన్ని శతాబ్దాలకుముందు మతం పుచ్చుకున్నవారు. వీరిని ప్రభుత్వం హింసించనారంభించింది. 1873 లో పాశ్చాత్య క్రైస్తవ ప్రభుత్వాలు కలుగజేసుకోడంవల్ల యీ మతహింస కొంత తగ్గింది. 1884 లో ప్రజలందరికి మతస్వాతంత్ర్యాన్ని చక్రవర్తి ప్రసాదించాడు. క్రైస్తవమతం పుచ్చుకున్న జపాన్‌వారి మొత్తంసంఖ్య 2,20,000. ప్రస్తుతం జపాన్‌లోనున్న మొత్తం క్రైస్తవులసంఖ్య 2,60,000 మాత్రమే.

స్త్రీ :

జపాన్‌లో స్త్రీలసంఖ్య సుమారు పురుషులతో పాటుంటుంది. పురుషునితో పోలిస్తే స్త్రీకి స్వాతంత్ర్యమే లేదు. అసంఖ్యాకులైన ప్రజాబాహుళ్యం అల్పసంఖ్యాకులైన ధనిక వర్గంచేత పీడింపబడుచున్న దేశంలో, సైనికనాయకులే ప్రజానాయకులుగా పూజింపబడే దేశంలో, చక్రవర్తే భగవంతుడైన దేశంలో, పురుషులకే స్వతంత్రతలేక రోజుకు 12 గంటలు చొప్పున చాకిరి చేసే దేశంలో స్త్రీలకు స్వాతంత్ర్యం ఎక్కడనుండి వస్తుంది ?

చక్రవర్తిత్వం—ప్రస్తుతపు చక్రవర్తి ఆ ముఠాలో 124 వ వాడు—షింటోమతం, బుషిడోనీతి, పూర్వీకులపూజ, అవిభాజ్యకుటుంబం జపాన్‌లో పాతుకుపోయాయి. తరతరాలుగావస్తూన్న కుటుంబ సాంప్రదాయాన్ని స్త్రీగూడా అనుసరించవలసివచ్చింది. భర్త కుటుంబాచారాలను భార్య అనుసరించకపోతే వెంటనే వెళ్ళగొట్టబడుతుంది. బిడ్డల కనడం; పోషించడం ప్రతి గృహిణియొక్క ప్రథమకర్తవ్యం. రెండో బాధ్యత, కుటుంబానికి బానిసయై చాకిరిచేయడం. ఇందులో ఏపనిని నిర్వహించకపోయినా—అందున స్క్రమంగా—ఆమెను అత్తగారింటివారుగాని, భర్తగాని వెళ్ళగొట్టొచ్చు. స్త్రీ యేవిధంగాగూడా 'సహధర్మచారిణి' గాదు. పురుషుడే యింటికి పెద్ద. భార్యతో నిమిత్తంలేకుండా అన్నివిషయాల్లో తానే వ్యవహరిస్తాడు. కుటుంబ ఆస్తి, పాస్తులమీద భార్యకెలాంటి హక్కు లేదు. భోజనమప్పుడు భర్తకన్నా తక్కువ ఎత్తుగలచోట కూర్చోవాలి భార్య.

కన్యగానుండగా తండ్రిపోషణలో, పెండ్లికాగానే భర్త ఆజ్ఞలో, వైధవ్యంలో కొడుకుల అదుపులో స్త్రీ కృశించి పోతూంది. పురుషునికంటె ముందు లేవ్వాలి, పురుషుని నిద్ర బుచ్చినతర్వాత తాను నిద్రబోవాలి, పురుషుని భోజన, ఫలాహారశేషం తానే తినాలి-పారేయగూడదన్ననిష్కర్షలు చాలా ఉన్నాయి. చట్టరీత్యా పురుషునకు ఒక్క భార్యమాత్రమే ఉండొచ్చు. అందుకనే అనేకపురుషులు, పెండ్లి చేసుకోకుండా ఉంపుడుగత్తెలనుతెచ్చి పెండ్లాంతోపాటు కాపురం పెడ్తున్నారు. ఉంపుడుగత్తెలు యీ పురుషుని కుటుంబానికి చెందినట్లు పరిగణింపబడడంలేదు. కాని, ఉంపుడుగత్తెల మొగపిల్లలకు కుటుంబాస్తిలో భాగమున్నది. స్త్రీ యిష్టాయిష్టాలతో నిమిత్తంలేకుండా పురుషుడామెకు విడాకులివ్వొచ్చు. భర్త వదలినస్త్రీని సంఘం నీచంగాచూస్తూంది. విడాకులివ్వడానికి పురుషుడికేకారణమైనా చాలు. గొడ్డుబోతురాలైనా, పిల్లలను సరిగా పోషింపకపోయినా, కుటుంబఅలవాట్లను చక్కగా అనుసరించలేకున్నా భార్య వెళ్ళగొట్టబడుతుంది. సాధారణంగా వివాహాలు తల్లిదండ్రులే నిర్ణయిస్తారు. పాశ్చాత్యుల నాగరికత ననుసరించినతర్వాత ఇటీవల స్వయంవరవివాహాలు చదువుకున్నవారిలో అలవాటులో కొస్తున్నాయి.

ఈ రోజుల్లో పల్లెటూళ్ళలో స్త్రీలసంఖ్య పురుషులకన్నా చాలా తగ్గుతూంది. పట్టణాల్లోని ఫాక్టరీలలో పని చేయను పల్లెటూళ్ళనుంచి స్త్రీలను తీసుకెళ్తున్నారు. ప్రతిస్త్రీ తన అత్తమామలను, తన తల్లిదండ్రులకన్నా, తన భర్తకన్నా ఎక్కువగా పూజిస్తూంది. వారికి ఎంతో చాకిరి

చేస్తూంది. ప్రతికుటుంబంలోని అన్నదమ్ములలో పెద్దవానికి గౌరవం, పెత్తనం ఎక్కువ. జేష్టుడి భార్యకే ఎక్కువబాధ్యత. జపాన్ స్త్రీని మించిన కష్టజీవి ప్రపంచంలో మరెక్కడ లేదు. యుగయుగాలుగా స్త్రీని పురుషుడు బానిసగా పాటించడం వల్ల, హింసించడంవల్ల, స్త్రీజాతి మొద్దుబారిపోయి యెంతటి కష్టాన్నైనా సహించగలుగుతూంది. పురుషుడు రంకుచేస్తే అడిగేవారే లేరు. స్త్రీ రంకుచేస్తే కుటుంబాన్నుంచి వెళ్ళగొట్టడమేగాకుండా సంఘమంతటిచేత అతి నీచంగా చూడబడుతూంది.

1868 తర్వాత జపాన్ జీవితవిధానంలో అనేకమార్పులొచ్చాయి. ఇవన్నీగూడా ప్రభుత్వం శాసించినందున గలిగిన మార్పులే. స్త్రీలను వారి దుస్థితినుంచి తప్పించడానికి ప్రభుత్వం ఏమాత్రం ప్రయత్నించలేదు. ఇంట్లో భర్త ఒక్కడే గాకుండా పురుషులందరుగూడా స్త్రీని అతినీచంగాచూస్తారు. పురుషులు పాశ్చాత్యనాగరికతను యిటీవల కొంతవరకు అనుసరిస్తున్నారుగాని స్త్రీలల్లో ఏమాత్రం మార్పురాలేదు. స్త్రీవిద్యను-ముఖ్యంగా పట్టణాల్లో-ప్రభుత్వం ప్రోత్సహిస్తూంది. కాని ఉన్నతవిద్య నభ్యసించిన స్త్రీలసంఖ్య స్వల్పం. పురుషునికన్నా స్త్రీకి తెలివితేటలు, సహనత హెచ్చు. జపాన్ స్త్రీలు వలచి వలపింపనేర్చిన వనితలేగాని పురుషులకు ప్రేమకన్నా కామమెక్కువ. భార్యను జపానీయుడు ఒక ఉత్పత్తియంత్రంగా——బిడ్డలకనడానికి——ఉపయోగిస్తున్నాడు.

స్త్రీలు రాజకీయపార్టీల్లో సభ్యులవడానికి వీల్లేదు. వీరికిగాను ప్రత్యేకసంస్థలు ఒకటి రెండున్నాయని గమనిం

చాం. ఇటీవల కొద్దిమంది స్త్రీలకు పౌరసత్వహక్కులు యివ్వబడ్డాయి. 1925లో కొత్త ఎన్నికచట్టం అమలులోకి వచ్చినప్పటినుంచి స్త్రీసంఘాలు తమకుగూడా పౌరసత్వహక్కులుండాలని ఆందోళన చేశాయి. అప్పటినుంచి కొన్ని ఉద్యోగాలు స్త్రీలకిస్తున్నారు. పురుషులుచేసేపనినే స్త్రీ చేసినా ఆమెకు పురుషునికిచ్చేజీతం యివ్వరు. ప్రాథమిక పాఠశాలల్లో ఉపాధ్యాయినులుగా హెచ్చుమంది స్త్రీలు పనిచేస్తున్నారు. ప్రభుత్వ శాఖల్లో గుమాస్తాగిరులు స్త్రీలకిస్తారుగాని ఉన్నతోద్యోగాలు వారికివ్వరు. కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో ఆచార్యపదవికి స్త్రీలర్హులుగారు. ధనిక కుటుంబాలకు చెందిన స్త్రీలుతప్ప మిగత కుటుంబాల స్త్రీలందరు కష్టించి జీవించాలసిందే.

పేదరికం కారణంగా వ్యభిచారం నానాటికి వృద్ధిచెందుతూనే ఉంది. తమ కుటుంబ ఋణాలదీర్చను అనేకమంది గృహస్థులు తమ కుమార్తెలను విక్రయించడం యిప్పటికీ అక్కడక్కడ జరుగుతునే ఉంది.

1936లో స్త్రీలు ప్లీడరువృత్తికి తర్ఫీదు నొందడానికి ప్రభుత్వం అంగీకరించింది. పూర్వం భార్య వ్యభిచారంచేస్తే మరణదండనను విధించేవారు. ఇటీవల అట్టి క్రూరశాసనాలను రద్దుచేశారు.

ప్రభువుల్లో వ్యభిచారం ఎక్కువ. ప్రతిప్రభువుకు అతని ఆరోగ్యం, ఆదాయాన్నిబట్టి ఉంపుడుగత్తెలుంటారు. భార్య యీ విషయమై నోరెత్తడానికి వీల్లేదు. భర్తను భార్య ప్రశ్నించడమే ఋషిడోకు విరుద్ధం. ఇక భర్తను ధిక్కరిస్తే మహాపాతకం.

"ప్రపంచంలో ఏ యితరదేశంలోను జపాన్ స్త్రీలవలె పాటుబడే వారు, త్యాగం చేసేవారు, ఎవరేదిచెప్పినా గొణగకుండా చిరునగవుతో ఎంతటి చాకిరినైనా చేసేవారు మరెవ్వరు లేరు. వారిత్యాగబుద్ధి ఎంతో ప్రసంసనీయం. నిర్భరదారిద్ర్యంలో, అతి నీచ బానిసత్వంలోగూడ వారనుభవించు ఆనందాన్నిచూస్తే నాకండ్లుకుట్టినై. మనం, యితర దేశీయులు జపాన్‌నుంచి కొనే సన్నని సిల్కు-బట్టలలో 80% యీ స్త్రీల ఉత్పత్తే. వారు జపాన్ జాతికంతటికి సేవచేస్తున్నారు. పూటకూలి యిండ్లలో, కాఫీ హోటల్లలో, సినిమాలలో, నాట్యశాలల్లో, దుకాణాల్లో, మోటారు బస్సులలో, ట్రాం బండ్లలో—ప్రతిచోట వీరిసేవ కండ్ల ఎదుట మూర్తీభవిస్తుంది. జపాన్‌వారి శ్రామికాభివృద్ధికి 50% జపాన్ స్త్రీలే కారణం. జపాన్‌లో కూతుళ్లను కనడం అదృష్టంగా భావిస్తున్నారు. తల్లిదండ్రులపట్ల ఆడపిల్లలకు ప్రేమ అపారం. వ్యవసాయంవల్ల నష్టపడియున్న తల్లిదండ్రులను రక్షించడానికి ప్రతి సంవత్సరం కొన్నివేలమంగి యువతులు తమ స్వగ్రామాలను వదలి పట్టణాలకు పోయి తమ శరీరాలను అమ్ముకుంటున్నారు—కూలికి. ఆడపిల్లలే జపాన్ రక్షకులు.*

పట్టు, పత్తి పరిశ్రమలలోని శ్రామికులలో 80% ఆడవారే. రోజుకు 10 గంటలు పనిచేయాలి వీరు. వీరికి రోజుకు సుమారు 3 అణాలుమాత్రమే కూలీగిడ్తుంది. ఈ పనివారిలో అన్ని కారులవారున్నారు—8 ఏండ్ల పిల్లలనుండి 60 ఏండ్ల ముసలివారివరకు. జపాన్ పరిశ్రమల్లో వారానికి 6 రోజులు పూర్తిగా పనిచేయాలి. కొన్ని పరిశ్రమలలో శ్రామికులు

---

* చమన్‌లాల్ 1936లో జపాన్ కెళ్ళొచ్చాడు. తన అనుభవాలను 'జపాన్ రహస్యాలు' అన్నపుస్తకంగా వ్రాశాడు. అందులో 'జపాన్ రక్షకులు' అన్న శీర్షికను జపాన్ స్త్రీ జీవితాన్ని వర్ణించాడు.

రెండు ముఠాలుగా చీలి ఒక్కొక్క ముఠా 9 గంటలసేపు పనిచేస్తుంది. స్త్రీలుగూడా యీ ముఠా విధానంలో అర్థ రాత్రివరకు పనిచేయాలసిందే. స్త్రీలు ఎంత నిపుణులైనాసరే రోజుకు రూ 2 లకుపైన కూలీ యివ్వరు.

ప్రతి మిల్లులో స్త్రీ శ్రామికులుండడానికి ప్రత్యేక వసతి గృహాలున్నాయి. ఈ వసతిగృహాలను మిల్లు యజమాన్లే కట్టిస్తారు; నడిపిస్తారు. వారానికి స్త్రీ శ్రామికులనుండి వసతికి, భోజనానికి కలిపి రూ 1 నుంచి రూ 3 లవరకు వసూలు చేస్తారు. కొన్ని ఫాక్టరీలు—ముఖ్యంగా యీ వసతిగృహాలుండేవి—స్త్రీలచేత రోజుకు 12 గంటల పనిచేయిస్తవి. ఈ పని వారికి నెల 1 కి రూ 23 ల చొప్పున జీతాలిస్తారు. వీరు భోజన వసతులకు నెల 1 కి రూ 15 లు యిచ్చుకోవలసుంటుంది. ఈ వసతిగృహాల్లో అధికారమంతా మిల్లు యజమాన్లదే. కొన్ని వసతిగృహాల్లో స్త్రీ శ్రామికులను అతిక్రూరంగా హింసిస్తున్నారు. ఈ స్త్రీలు ఏకారణంచేతనైనా సమ్మెచేస్తే యజమాన్లు వారికి కూడుబెట్టకుండా హింసించి లొంగదీస్తారు. అది వీలుగాకపోతే-ఫలింపకపోతే వీరిని నడివీధిలోకి నెడ్తారు. ఈ స్త్రీలలో అనేకులు దరి, దిక్కు లేనివారు. కుటుంబ ఋణాలను తీర్చను తల్లి, దండ్రులు అమ్మినందుననో, లేక తమ కుటుంబాన్ని అప్పులనుండి రక్షించను తమంతట తా మమ్ముడుబోయిన వారుగనో, లేక భర్త వెళ్ళగొట్టినందున దిక్కులేక కూలీపని చేసుకునే వారుగనో, లేక వ్యభిచారం చేసినపాపానికి తమకుటుంబం, సంఘం నీచంగా చూచినందున విసిగి, వేసారి యీ కాయకష్టానికి పూనుకున్నవారుగనో ఉం

టారు. అందుచేత నిలువ నీడలేక, తిన తిండిలేక, చేయను పని లేక నడివీధిపాలైనప్పుడు మిల్లు యజమానికి వీరు సులభంగా లొంగుతారు.*

గైషా :

మన దేశంలో పెండ్లిళ్లప్పుడు, ఇతర కార్యాలప్పుడు భోగంవారు నృత్య, గాన ప్రదర్శనాలిచ్చినట్లే జపాన్‌లో గాన, నృత్య ప్రదర్శనాలనిచ్చే స్త్రీలను 'గైషా' అని అంటారు. వీరిలో కొంతమంది గొప్ప కళావంతులు: ముఖ్యంగా నృత్యంలో. వీరిలో కొంతమంది వారి ఆర్థిక దుస్థితి కారణంగా పడుపు వృత్తికి పాల్పడుచున్నారు. గైషాపడుచులు జపాన్‌లో ప్రతిచోట నున్నారు. నగరాల్లోని హొటల్లలో ప్రతి రోజు వీరి ప్రదర్శనాలు తప్పకుండా ఉంటాయి. జపాన్‌లో పడుపు వృత్తికి ప్రసిద్ధిచెందిననగరం కోబ్.

## భూకంపాలు

జపాన్‌లో భూకంపాలు, అగ్నిపర్వతాలు, ఉప్పెనలు మెండు. పసిఫిక్ మహాసముద్రపు సుడిగాలులీ దేశంలోకి అపరిమితంగా వీచి ఎంతో నష్టం కలిగిస్తూన్నాయి. ఇప్పటికి సజీవులైయున్న అగ్నిపర్వతా లున్నాయి. వీటన్నిటిలోకి పెద్దది, ముఖ్యమైనది, ఎక్కువ అపాయకరమైనది అసమయామ. ఎక్కువ అపాయకరమైంది గనుకనే యీ అగ్నిపర్వ

* జపాన్‌లో కార్మిక సంఘాలు బహిష్కరింపబడలేదు. కానీ ప్రభుత్వ చట్టాల్లో చెప్పబడనిదేదీ దేశంలో ఉండగూడదు. అందుకనే యిటీవల కార్మిక సంఘాలను రూపుమాపారు.

తాన్ని నేటికీ ఎక్కువగా పూజిస్తున్నారు. * ఈ అగ్నిపర్వతం కక్కనారంభించినప్పుడు లావామాత్రమేగాక పెద్దపెద్ద బండలనుగూడా చుట్టూ కొన్ని మైళ్ళదూరంవరకు వెళ్ళ గక్కుతూంది. అడపతడప యిట్టి అవాంతరాలు కల్గుతూనే ఉన్నాయికాని యివేవీ భూకంపాలంత వినాశకరమైనవిగావు.

భూకంపాలవల్ల జపాన్ ప్రజ లనుభవించే కష్టనష్టాలను గ్రహించడానికి 1923 లో గల్గిన భూకంపాన్ని గురించి తెలుసుకుంటే చాలు. సాలీనా సగటున 116 భూకంపాలొస్తున్నై. కానీ యింతకుముందెన్నడు యింత తీవ్రనష్టం కలగలేదు. 1923 సెప్టెంబరులో కలిగిన భూకంపంవలని నష్టాలు—

1,60,000 చావులు.

5,76,000 యిండ్లు కూలినై.

రూ. 1,000,00,00,000 మొత్తం నష్టం. (వేయికోట్లు)

ప్రజల్లో కల్గినభీతిని అంకెలతో లెక్కవేసి చెప్పడానికి వీల్లేదు. భూకంపాన్ని స్వయంగా అనుభవించినవారు ఊహించుకోవలసిందే.

ఈ భూకంపంఫలితంగా టోకియో, యోకహామా నగరాలను ఆధునికవిధానాల పునర్నిర్మించాలసొచ్చింది. అందువలననే 1923లో రూ. 582,00,00,000 గా నుండిన జాతీయఋణానికి మరి రూ. 81,75,00,000 చేర్చాలసొచ్చింది.

---

* 11-5-42 న మరల అసమ యామా పర్వతం అగ్నివర్షాన్ని గురిపించిందని పత్రికలు ప్రకటించినై.

హాషిరో అరిట



1940 లో జపాన్ విదేశాంగమంత్రి. 1940 జూలై 4 న కొత్త సిద్ధాంతాన్నొకదాన్ని లేవదీశాడు. దీనినే 'జపాన్ వారి మన్రో సిద్ధాంతం' అంటారు. ఆసియాఖండ రాజకీయాల్లో ఆసియాఖండవాసులు దప్ప యితరులు జోక్యం కలుగజేసుకోకూడదని ఈ సిద్ధాంతం యొక్క ముఖ్యోద్దేశం.

ఇవని మట్సుయి



జపాన్ సేనానాయకుడు. మంచూరియా యుద్ధంలో యీతని నాయకత్వాన్నే జపాన్ జయం పొందింది. చైనాను నాశనం చేయ పూనుకున్నాడు.

# 4. ఆర్థిక విధానం.

## సంపద

1930 లో మొత్తం జనాభాలో 3,23,90,155 పురుషులు 3,20,59,850 స్త్రీలు ఉన్నారు. కొద్దిమంది ధనికులైన ప్రజలుతప్ప మిగత స్త్రీ పురుషులందరు కాయకష్టంచేసి జీవించేవారే.

జపాన్ విస్తీర్ణం 9,62,89,000 ఎకరాలు. ఇందులో $\frac{3}{5}$ భాగం చక్రవర్తి, ప్రభుత్వం, స్థానికపరిపాలనల సొమ్ముగా నుంది. మిగిలిన $\frac{2}{5}$ భాగం వ్యక్తులపరమైయుంది. సాగుబడి కింద నున్నమొత్తం భూమివిస్తీర్ణం 1,40,00,000 ఎకరాలు. ఇందులో 72,68,634 ఎకరాలు వరిపంట కుపయోగిస్తున్నారు. వరిచేలల్లో 30% రెండుపంటలు పండేవి. ప్రజలకు సేక్ అనే దాహం చాల ఇష్టమైంది. దీనిని బియ్యంనుంచే తయారు చేస్తారు. బియ్యం ముఖ్యాహారమైనందున అతిశ్రద్ధతో వరి పంటను పండిస్తున్నారు. ఈ క్రింది అంకెలు జపాన్ వరిపంటను స్పష్టపరుస్తై:—

| | | | | |
|---|---|---|---|---|
| అమెరికా | పంట | ఎకరానికి | 1,130 | పౌనులు |
| భారతదేశం | ,, | ,, | 805 | ,, |
| జావా | ,, | ,, | 970 | ,, |
| జపాన్ | ,, | ,, | 2,510 | ,, |

పర్వతాల వంపులమీదగూడా 1,500 అడుగుల ఎత్తువరకు వ్యవసాయం చేస్తారు.

జపాన్ అడివులవిస్తీర్ణం 4,50,00,000 ఎకరాలు. ఇందులో 2,60,00,000 ఎకరాలు చక్రవర్తి, రాష్ట్ర, స్థానిక పరిపాలనలు, దేవాలయాలు మొదలైనవాటి సొమ్ము ఉంది. మిగత 1,90,00,000 ఎకరాలు వ్యక్తులసొమ్ముగా నుంది. ప్రభుత్వవరుంబడి అడవులనుండి 1925 లో రూ. 7,00,00,000. అడవులనుండి వ్యక్తులవరుంబడి రూ. 2,25,00,000. ప్రభుత్వానికి ఖర్చులుపోగా నికరంఆదాయం అడవులనుండి రూ. 3,00,00,000లకు కొద్దితక్కువ. ఈ అడవులల్లో టేకు, సింధూరం, దేవదారు మొదలైనచెట్లు ఎక్కువగానున్నాయి. చాపలు పట్టడంవల్ల అనేకలక్షలమంది జీవిస్తున్నారు. ఈ చాపలను దేశంలో అమ్మడమేగాకుండా ముఖ్యంగా చైనాకు ఎగుమతి చేస్తున్నారు. 1926 లో చాపల ఎగుమతివల్ల జపాన్ వరుంబడి రూ. 34,50,00,000. జపాన్ కొండలోయల్లో అక్కడక్కడ బంగారం దొరుకుతుంది. 1926 లో దొరికిన బంగారంవిలువ రూ. 1,80,00,000 మాత్రమే. 1925 లో 91 బొగ్గుగనుల కంపెనీ లున్నాయి. వీటన్నిటి మూలధనం రూ. 39,00,00,000. 593 గనులలో పనిసాగుతూంది ఆ సంవత్సరాన. అదేసంవత్సరంలో తొవ్వబడ్డ నేలబొగ్గు మొత్తం 3,10,00,000 మెట్రిక్ టన్నులు. జపాన్ సముద్రం ఒడ్డున పెట్రోలియం దొరుకుతుంది. కాని చాలకొద్దే దొరుకుతుంది. 1922 లో 7,10,00,000 గాలన్లు దొరికింది. 1926 లో యీ ఉత్పత్తి తగ్గింది—5,00,00,000 గాలన్లుమాత్రమే.

జపాన్ ఖనిజసంపదలో పేదరాలు. తన అవసరాలకన్నా ఎక్కువగా రాగిమాత్రమే ఉత్పత్తిచేస్తూంది. ఇనుము,

నేలబొగ్గు, పెట్రోలియం మొదలైన ఖనిజాలను యితర దేశాల నుండి దిగుమతి చేయాలసిందే. ముడిఇనుము 1930 లో 19,73,000 టన్నులు దిగుమతి చేసింది. నేలబొగ్గు ఉపయోగం నానాటికి హెచ్చుతూంది. 1907 లో జపాన్ 1,10,00,000 టన్నుల నేలబొగ్గు నుపయోగించింది. 1927 లో 3,00,00,000 టన్నుల నుపయోగించింది. నేలబొగ్గుకు గూడా దిగుమతిపైనే ఆధారపడాలి జపాన్. మంచూరియా లో నేలబొగ్గుగను లెక్కువగా నున్నాయి. అందుకే జపాన్ మంచూరియా నాక్రమించుకుంది. జపాన్‌లో పెట్రోలు ఉత్పత్తిగూడా తక్కువే. 1930 లో 41,25,10,000 గాలన్ల పెట్రోలును ఖర్చుచేసింది. ఇందులో 32,83,10,000 గాలన్లు దిగుమతి చేయబడినవి. ఈ క్రిందిపట్టీ 1927 లో జపాన్ ఖనిజసంపదను, అందలిలోటును విశదీకరిస్తుంది—

| ఖనిజం | ఉత్పత్తి (టన్నులు) | దిగుమతి (టన్నులు) |
|---|---|---|
| సీసం | 3,394 | 55,567 |
| తుత్తినాగం | 17,488 | 44,976 |
| ఉప్పు (రాతి) | 6,19,138 | 2,18,396 |

1868 లో చక్రవర్తి పునరుద్ధరణనాటికి జపాన్ జాతీయఋణం రూ. 72,00,000 మాత్రమే. పునరుద్ధరణానంతరం భూస్వాములకు పారితోషికమివ్వను రూ. 25,95,00,000 ఋణంచేసింది ప్రభుత్వం. చైనా-జపాన్ యుద్ధం (1895) ఫలితంగా రూ. 21,55,00,000 అప్పైంది. 1896 జాతీయ ఋణంమొత్తం రూ. 52,65,00,000. ఈ యుద్ధానంతరం

1904 వరకు జరిగిన 10 ఏండ్లలో రూ. 28,20,00,000 అప్పైంది. ఈరోజుల్లోనే జపాన్ పరిశ్రమలు గొప్ప అభివృద్ధిని చెందినై. 1904-5 రష్యా యుద్ధం ఖర్చు రూ. 225,00,00,000. 1905 లో యీ ఋణం మొత్తం రూ. 328,35,00,000. 1906 లో దేశంలోని రైల్వేలన్నిటిని ప్రభుత్వం కొన్నది. ఈ కొనుగోలుకుగాను మళ్ళీ ప్రభుత్వం అప్పుచేసింది— రూ. 90,90,00,000. 1918వరకు యీఅప్పు అలాగే ఉంటూ వచ్చింది. గడచినయుద్ధానంతరం తన పరిశ్రమల నభివృద్ధి చేయడానికి మరల కొంత అప్పుచేసింది ప్రభుత్వం. 1923 లో రూ. 582,00,00,000 అప్పుండేది. 1923 లో వచ్చిన భూకంపం యీ ఋణానికి మరో రూ. 81,75,00,000 చేర్చింది. 1927లోగల్గినఆర్థికదుస్థితివల్ల ప్రభుత్వం రూ. 105,00,00,000 ఋణం చేసింది. 1930 మార్చి 31-వ తారీకుకు జపాన్ జాతీయ ఋణంమొత్తం రూ. 893,91,85,630.

1925 లో జపాన్ ప్రభుత్వోద్యోగులసంఖ్య—సైన్యాన్ని మినహాయించి-50,00,000. ప్రధానమంత్రి జీతం నెల 1 కి రూ. 1,600 మాత్రమే.

## వ్యవసాయం

జపాన్ పారిశ్రామిక దేశంగాని వ్యవసాయిక దేశం గాదు. అంటే జపాన్ప్రజల్లో యెక్కువమంది తమ జీవనానికి పరిశ్రమలమీదే అధారపడుతున్నారు. వ్యవసాయం, చాపలు పట్టడంమూలాన జీవించేవారు 48% మాత్రమే. వ్యవసాయానికి తగిన భూమి మొత్తం కొద్దిమంది కోటీశ్వరుల సొమ్మై

యుంది. రైతులలో హెచ్చుమందికి సొంతభూమి లేదు. వారు కేవలం కౌలుదార్లుమాత్రమే. ఈ పేదరికం కారణంగా జపాన్‌లో ఎన్నడో సాంఘిక విప్లవం వచ్చియుండాల్సింది. కానీ యింతవరకు విప్లవం రాలేదుసరేగదా యిప్పట్లోవచ్చే చూకీగూడా కనబడ్డంలేదు. ఇందుకు కారణాలనేకమున్నాయి.

చక్రవర్తి కుటుంబం తన సొంతసొమ్ముగా 10,00,000 ఎకరాల సాగుబడి భూమిని కల్గుంది. భూమి సొంతదార్లలో 1% వారుమాత్రమే భూమి అంతటిలో 25%ను తమ సొంత సొమ్ముగా గల్గియున్నారు. 6% సొంతదార్లు మరో 25%ను గల్గియున్నారు. మిగిలిన 93% భూకామందులు మిగత 50%ను భూమిని గలియున్నారు. సాధారణంగా జపాన్‌లో వ్యవసాయ క్షేత్రం సగటు విస్తీర్ణం $1\frac{1}{2}$ ఎకరం మాత్రమే. కానీ 25,00,000 రైతులు యింతకంటే-$1\frac{1}{2}$ ఎకరానికంటే-తక్కువ విస్తీర్ణంగల భూమిమీద జీవిస్తున్నారు.

రైతులకుగల భూమి కొద్దిపాటి. వారికుటుంబాలా! చాలపెద్దవి. ఈ కొద్దిపాటి భూములమీదవచ్చే ఆదాయాలతో జీవించలేవు. ఇందుకుతోడు ప్రతిరైతు కుటుంబంలోని పిల్లలసంఖ్య ఏ సంవత్సరానికి కాసంవత్సరం పెరుగుతునే ఉంది. ఈ జనాభివృద్ధి రైతుకుటుంబాల్లో మాత్రమేగాదు. ప్రతి కుటుంబంల్లోను. ఇందుకు కారణం జపాన్‌ప్రజలు బలాఢ్యులవడంగాదు; వారు కామశాస్త్ర పారంగతులుగారు. వారి ముఖ్యాహారమైన బియ్యం-చాపల్లోనుంది యీ మహత్యం. ఇందుకు తార్కాణం మన వంగ సోదరులే.

ఇంగ్లండులో మొత్తం జనాభాలో వ్యవసాయంమీద ఆధారపడేవారి సంఖ్య 7% మాత్రమే. జపాన్‌లో వీరిసంఖ్య 48%. (చాపలు పట్టడంకూడా వ్యవసాయానికి తోడ్పడిన వృత్తిగా లెక్కింపబడుతూ ఉంది.) సాగుబడి భూమిలో 40% రైతులు కౌలుకు దీసుకొని సాగుచేస్తున్న భూమి. ఇప్పటికి 50 ఏండ్లుగా యిలాగే జరుగుతూంది. పంటలో సగం భూమి సొంతదార్లకు మక్తాకింద యిచ్చుకోవాలి. మిగత సగంలో భూమిశిస్తు, యితర పన్నులు, అప్పులకు వడ్డీ మొదలైన ఖర్చులు రైతచ్చుకోవాలి. ఈ ఖర్చులన్నీ పోయి మగిలిన కాస్తో-కూస్తో తనకుటుంబ జీవనానికి. రైతులు నిరుపేదలుగా ఉన్నారు. వారిలో హెచ్చుమంది తాము కష్టపడి పండించిన పంటఫలితమైన వరన్నాన్ని తిననైనా నోచుకున్నారుగారు. కొంతమంది పేదరైతులు చాపలు కొనుక్కోడానికిగూడా డబ్బులేక ఉప్పునీటి బుక్కడాలను (పాముల వంటి చాపలు) ముఖ్యాహారంగా ఉపయోగిస్తున్నారు. మరీ నిరుపేదజనం కొన్నిచోట్ల చెట్ల బెరడుమీదే జీవిస్తున్నారు.

సాలీనా రూ 375 లకు మించని ఆదాయంగల రైతు కుటుంబాల ఋణం మొత్తం రూ 1,500,00,00,000 లు. ఈ నిష్టదరిద్రంలో వ్యవసాయపు పనిముట్లను కొనను డబ్బెక్కడ నుంచొస్తుంది? భూమి సొంతదారుడైన భూస్వామి తన డబ్బును పరిశ్రమలలో పెట్టుబడి పెడ్తాడేగాని భూమిని బాగు చేయను, ఫలితాన్ని యెక్కువచేయను పాటుబడడు. ఈ విధంగా కౌలుదార్లు, కొద్దిపాటి రైతులు, తమకాయ కష్టం మీదే ఆధారపడివలసి వచ్చింది జీవనాధారానికి. కూలీలను

నియోగించను డబ్బులేక చాకిరంతా పిల్లలచేత చేయిస్తారు. అందుకే గావోసు! పిల్లల నపారంగా కంటారు. వరిచేలల్లో రైతులకెక్కువ సాయపడేవారు వారిపిల్లలే. ప్రతి ఎకరం భూమిపై కష్టించేవారి సంఖ్య హెచ్చినా పంటమాత్రం హెచ్చడంలేదు. ఇందుకు కారణం రైతులువద్ద మేలురకపు విత్తనాలు లేకపోవడం: వారు భూమికి ఎరువ వేయలేకపోవడం. ఇటలి, స్పెయిన్ మొదలైన దేశాలతో పోలిస్తే జపాన్‌లో ఎంతో తక్కువ పంటపడుతూం దనాలి.

దేశంలోని పెట్టుబడ మొత్తం యీ క్రిందివిధంగా పంచబడి ఉంది—

| | | | మొత్తంలో భాగం నూటికి. |
|---|---|---|---|
| వ్యవసాయం | రూ. | 5,205,00,00,000 — | 47 |
| వ్యాపారం | రూ. | 1,950,00,00,000 — | 17 |
| పరిశ్రమలు | రూ. | 1,500,00,00,000 — | 14 |
| ఇతర ఉత్పత్తి | రూ. | 3,600,00,00,000 — | 22 |
| మొత్తం ... | రూ. | 12,255,00,00,000 — | 100 |

1925లో జపాన్ పంటలన్నిటి విలువ రూ 666,00,00,000. ఇందులో వరిపంట విలువమాత్రం రూ 375,60,00,000 లు. పంటలవలని దేశాదాయంలో సగానికిపైన వరిపంటే సమకూరుస్తుంది. వ్యవసాయంమీద జీవించేవారిసంఖ్య సుమారు 4,00,00,000.

జపాన్ రైతులను పేదరికాన్నుండి కొంతవరకు రక్షించామని 40 ఏండ్లనాడు పట్టు పరిశ్రమను ప్రారంభించారు. ఈ పరిశ్రమ, పిదప నారంభింపబడిన పత్తిపరిశ్రమ లేకుంటే సాలీనా లక్షలమంది రైతులు కూటికిలేక చావ్వాలసిందే.

## రైతు ఉద్యమం

1925 లో కొత్త నిర్మాణచట్టం శాసించబడ్డది. అప్పట్లో దేశంలోని రైతుసంఘం 'సంయుక్త పార్టీ' నొకదానిని స్థాపించాలని ప్రయత్నించింది. ఈ కొత్తపార్టీని ప్రభుత్వం నమ్మనందున ఆ పార్టీ పుట్టిన్నాడే గిట్టిందిగూడా. అప్పట్లో మితవాదులైన మిన్ సెయిటోపార్టీ వారధికారంలో ఉండి గూడ రైతుఉద్యమా న్నరికట్టారంటే అధికారవర్గానికి రైతులకుగల పరస్పరవైషమ్యం విశదమౌతుంది. జపాన్ ధనిక వర్గం లాభాల నపరిమితంగా దోచుకుంటూన్న 1926 లో, అభివృద్ధికి పాటుపడే సంస్కరణపార్టీలు మూడు ప్రారంభింపబడ్డాయి. ఈ మూడింట్లో శ్రేష్టమైంది, నిజంగా ప్రజల మేలుకోసం పాటుపడేది 1928 లో టనక ప్రభుత్వంచే అణచివేయబడ్డది.

రైతు-కార్మికోద్యమాలను రూపుమాపను ప్రభుత్వం 1925 లో 'శాంతి రక్షణచట్టం' నొకదానిని అమలులోకి దెచ్చింది. ఈ చట్టాన్ననుసరించి జాతీయవిధానాన్ని మార్చ ప్రయత్నించినా, వ్యక్తిగతఆస్తి విధానాన్ని మార్చ ప్రయత్నించినా 10 ఏండ్ల కఠినశిక్ష విధింపబడునని నిష్కర్ష చేయబడ్డది. 1928 లో యీచట్టాన్ని సవరించి పై నేరాలకు మరణదండన విధింపబడునని శాసించారు. ఈ చట్టంక్రింద 1928-38 మధ్యకాలంలో 'అపాయకరమైన తలంపులున్నందుకు' 60,000 మందికిపైగా శిక్షింపబడ్డారు.

నకి మిన్‌సుయ్‌టో (సోషల్ డెమొక్రాటిక్ పార్టీ) యీ మూటిలో నొకటి. ఈ పార్టీ కార్యక్రమం సక్రమంగా జరగనందువల్ల త్వరలోనే ప్రజలీపార్టీని మరిచిపోయారు.

'అఖిల జపాన్ కార్మిక-రైతుపార్టీ' యీ మూటిలో నెక్కువ సేవచేసింది. కానీ యీ పార్టీలో అనేకరకాల సభ్యులు చేరారు. కమ్యూనిస్టులు, సామ్యవాదులు, మిత వాదులు, రైతు సేవకులు, కార్మికులు—మొదలైన పలు తెగలవారు, వారి భిన్నాభిప్రాయాలతో సభ్యులుగా నుండ డంవల్ల ఐక్యతకన్నా, భిన్నతే ఎక్కువగా నేర్పడ్డది. ఈ పార్టీలో 'దేశభక్తులు' అనేకులు సోషలిస్టులన్న బురఖాతో చేరారు. 1931 లో మంచూరియాసమస్య ప్రారంభంకాగానే యీ దేశభక్తులు బయుటబడ్డారు. సకి మిన్‌సుయ్‌టో పార్టీ నాయకుడు తన కొద్దిపాటిబలగంతో ఆ పార్టీని వదలి వెళ్లాడు. ఈతడే 1932 లో 'జపాన్‌రాష్ట్రీ సోషలిస్టుపార్టీ' అన్న పేర కొత్త సంస్థను లేవదీశాడు. ఈ కొత్తపార్టీ ఆశయం పార్లమెం టరీవిధానాన్ని పెట్టుబడిదారి విధానాన్ని నాశనంచేసి చక్రవర్తి నిరంకుశాధికారాన్ని వహించాలని. ఈ క్లిష్టపరిస్థితులలో సోషలిస్టుపార్టీలు రెండూఏకమై 'ష్కైటైషుటో' అన్న పేర కొత్తపార్టీగా ప్రారంభమైనవి. కార్మికోద్యమనాయకులు కేవలం మానవసేవ చేద్దామన్న సదుద్దేశంతో యీ ఉద్య మాన్ని చేరినవారు. ఇందులో చాలమంది క్రైస్తవ, బౌద్ధ, షింటో మతాలలో ప్రబలనమ్మక మున్నవారు. వీరికి సోషలిజంలో — విప్లవంలో అట్టే నమ్మకంలేదు. సోష లిస్టు సిద్ధాంతాలపట్లగల నమ్మకంవల్లగాదు, వీరు కార్మికో

ద్యమంలో చేరింది. దేశంలోని క్లిష్టపరిస్థితుల ననుసరించి యీ అతివాద (సామ్యవాద)పార్టీలన్నీ కొంతకలిసినా రాజకీయంగా పార్టీలన్నిటిలోకి అతి బలహీనమైన పార్టీ సోషలిస్టు పార్టీ. సోషలిస్టు పార్టీ లతరఫున 1928లో 8 మంది, 1932లో 3 రు, 1936లో 23 రు, 1937లో 37 మంది ప్రతినిధిసభకు ఎన్నుకోబడ్డారు.

కార్మిక-రైతుఉద్యమాలను సరియైనమార్గాల నడిపే నాయకులు లేనందున నానాటికి యీ ఉద్యమాల ప్రాబల్యం తగ్గుతూనే వచ్చింది. కాలానుగుణ్యంగా నేడు జపాన్ కార్మికవర్గంగూడా సామ్రాజ్య వ్యాపకవిధానాన్ని పైకి బలపరుస్తూనే ఉంది. ప్రపంచ ఆర్థికదుస్థితి 1930 లో జపాన్‌కు చేరింది. 1929 నుంచి జపాన్ ఎగుమతివ్యాపారం సన్నగిల్లింది—సగమైంది. శ్రామికుల కూలీలు, మధ్యతరగతిప్రజల జీతాలు తగ్గించబడినాయి. దేశంలోని నిరుద్యోగుల సంఖ్య 1930 లో—ప్రభుత్వ లెఖ్ఖలనుబట్టి—30,00,000.

### రాకపోకలు

అనాదినుంచి నోరిమొనో అని పిలువబడే పల్లకీవంటి మోత పరికరంలో ధనికులు ప్రయాణాలు చేసేవారు. ఆ రోజుల్లో జపాన్‌లో మంచిరోడ్లే లేవు. ప్రతిబాటున మట్టి, దుమ్ము, బురద మెండుగా నుండేది. కొంతకాలానికి ఇద్దరు మోతగాండ్లు మోసే నోరిమొనో బదులు జిన్‌రిక్షాలు వాడుకలోకొచ్చినై. ఈ రిక్షాలను ఇద్దరుగాని ఒక్కమనిషిగాని

లాగొచ్చు. బరువైన వస్తువులను మోయడానికి ఎద్దుబండ్లను వాడేవారు.

1868 విప్లవానంతరం అన్నిటితోపాటు రాకపోకల సౌకర్యాలు గూడా మారినై. పెద్ద నగరాల్లో ట్రాంబండ్లు వాడుకలోకొచ్చినై. ఇటీవల మోటారుబండ్లను వాడుతున్నారు. ఇప్పటికి గ్రామాల్లో — పూర్వంలాగా బరువుల మోయను గుఱ్ఱాలను, ఎద్దులను వాడ్తున్నారు. వీటికి మన లాగా లాడాలు గొట్టరు. కొండప్రదేశాల్లో వీటిగిట్ట లరిగిపోకుండా గిట్టలచుట్టూ గడ్డి చుట్తారు.

1869లో క్యూషులో క్షామంకల్గింది. ఇతర దీవులలో కావలసినంత బియ్యమున్నా యీదీనికి చేర్చడానికి తగుమైన రాకపోకల సౌకర్యాలు లేకపోయినై. జపాన్‌వారు రైలు మార్గాల నేర్పాటుచేయ నిశ్చయించుకున్నారు. ఇందుకుగాను అంగ్లేయులు రూ 1,50,00,000 లు అప్పిచ్చారు. 1872 సెప్టెంబరులో జపాన్‌లోని మొదటి రైలుమార్గం— టోకియో-యోకొహామా రైల్వే తెరవబడ్డది. 1878 లో మొదటిసారి ప్రజాహిత కార్యాలకోసం ప్రభుత్వం జాతీయ ఋణాన్ని లేవదీసింది.

1925 లో జపాన్ స్టీమర్ల సంఖ్య 48,002; బరువు 49,16,501 టన్నులు. జపాన్‌లో విదేశ నావలొచ్చి నిలవడానికి తగిన రేవు పట్టణాలు 41 ఉన్నాయి.

1877 లో టెలిఫోన్‌లు వాడుకలోకొచ్చినై. 1927లో 21,89,000 మైళ్ల పొడవుగల టెలిఫోన్ వాడుకలోనున్నది. టెలిఫోన్ మారకస్థలాలు 2,262 ఉన్నాయి. టెలి

ఫోన్‌ల నుపయోగించే సభ్యులసంఖ్య 5,52,557. టెలిఫోన్ ద్వారా అంపబడిని మొత్తంవార్తలు 200,00,00,000.

## వ్యాపారం

1868 బూర్జువా విప్లవానంతరం జపాన్ రెండు సమ సమస్యల నెదుర్కోవలసి వచ్చింది. ఈ రెండుసమస్యలే నేటి జపాన్ దురాక్రమణకు, రక్తపిపాసకు, అమానుషత్వానికి కారణాలు. పాశ్చాత్యదేశాల్లో అత్యంతాభివృద్ధిని చెందు చున్న యంత్రోత్పత్తి విధానాన్ని తా నవలంబించడం మొద టిది. రెండోది, అప్పటికే పాశ్చాత్యసామ్రాజ్యవాదులు పూర్తిగా పంచుకున్నప్రపంచంలో తన వస్తువుల నమ్ముకో డానికి బజార్లను, తనకు ముడివస్తువుల సరఫరాచేయడానికి వలసరాజ్యాలను వెతకడం.

1868లో జపాన్ సంఘజీవనం యంత్రాలతో గూడు కొన్న పారిశ్రామికవిప్లవానికి తగినట్లు లేదు. అట్లుండికూడా తన పరిశ్రమల నభివృద్ధిచేయ నారంభించింది. ఈ కొత్త పరి శ్రమలకు అపారమైనపెట్టుబడి, శ్రామికవర్గం కావలసొచ్చింది. పిల్లల నెక్కువగా కనమని ప్రభుత్వం ప్రజల ప్రోత్సహించింది. పరిశ్రమలు నెలకొల్పబడి ఉత్పత్తి బాగా సాగ నారంభించిన తర్వాత యీ వస్తువుల నమ్ముకోను బజార్లు కావలసొచ్చినై. ఎక్కడ బజార్లు ఖాళీగాలేనందువల్ల యుద్ధాలకు తెయారైంది జపాన్.

జపాన్ ప్రజలకు 'ఆర్థికదృష్టి' చాలతక్కువ. పాశ్చాత్య దేశాల్లోని శ్రామికులంత ఉత్పత్తి చేయలేరు వీరు. ఇందుకు

వాతావరణపరిస్థితి కొంత కారణం. యంత్రాల నడపడంలో వీరికి నిపుణత్వం కాస్త తక్కువ. వీరు పాశ్చాత్యులంత బలాఢ్యులుగారు. అందువల్ల జపాన్ పాశ్చాత్య గుత్తవ్యాపారస్థులతో వ్యాపారంలో పైపోటీ చేయడానికి ఎన్నో కక్కుర్తి విధానాలకు పాల్పడవలసి వచ్చింది. గృహపరిశ్రమలు, పిల్లలచే కూలీచేయించడం, అతి చౌక కూలివారు మొదలైన విధానా లేర్పడ్డవి. వీటికితోడు జపాన్ వ్యాపారస్థులు మరో మార్గాన్ని కనిపెట్టారు.

జపాన్‌లో 100 బేళ్లు బట్ట ఖర్చౌతుందనుకుందాం. ఈ బట్ట నుత్పత్తిచేయను రూ. 100 పడుతుందనుకుందాం. దేశానికి కావలసింది యీ 100 బేళ్లే. కానీ 50 బేళ్ళు-యింతకు పైగా-ఉత్పత్తిచేస్తే రూ 30 ఎక్కువౌతుంది. యంత్రసహాయంతో ఎంత ఎక్కువ ఉత్పత్తిచేస్తే, సాధారణంగా, అంత చౌకగా గిట్టుతుంది. అందువల్ల తమ దేశంలో 100 బేళ్ళకుపైగా ఖర్చుగాకున్నా ధనికవర్గం 150 బేళ్లు ఉత్పత్తి చేస్తుంది. ఇందుకైనఖర్చు రూ. 130 తన దేశంలో అమ్ముడుబోయే 100 బేళ్ళమీదే సంపాదిస్తుంది. మిగిలిన 50 బేళ్లను ఇండియావంటి యితర దేశాల కెగుమతిచేసి ఏదో ఒకధర కమ్ముతుంది. సహజంగా విదేశాల్లో అమ్మేధర తన దేశంలో నమ్మిన ధరకన్నా ఎంతో తక్కువ. జపాన్ సిల్కు మన గుంటూరులో గజం రూ. 1-0-0 కిస్తుంటే మనలో అనేకులు జపాన్‌లో బహుశ గజం రు. 0-4-0 ఉంటుందని, ఏ జపాన్‌శాస్త్రికో, పోగాకుపంతులుకో వ్రాసి జపాన్‌నుంచే తెప్పించుకుందామని గాలిమేడలు కడ్తారు. నిజంలో ఇండియాలో రు. 1

కిచ్చే జపాన్ వస్తువుల వెల జపాన్‌లో రూ 2-0-0. ఈ విధానాన్నే ఆంగ్లంలో 'డంపింగ్' అంటారు. ఈ విధానాన్ని అవలంబించి జపాన్ పాశ్చాత్య పారిశ్రామిక దేశాలతో పోటీచేయగల్గింది.

అంతట బ్రిటన్, అమెరికాలు జపాన్ పోటీ ధాటికి ఆగలేక తమ దేశాల్లోకి, తమ వలసరాజ్యాల్లోకి జపాన్ వస్తువులు రాకుండా దిగుమతిపన్నుల విధించ నారంభించినై. జపాన్ ఉత్పత్తిశక్తి హెచ్చుతూ నేఉన్నా ప్రజల కొనుగోలు శక్తి యేమాత్రం హెచ్చకపోవడంచేత తన ఉత్పత్తిని జపాన్ యితర దేశాల్లోనే అమ్ముకోవలసి వచ్చింది. తన ఎగుమతి వ్యాపారానికి ఇతర ప్రభుత్వాలు అడ్డం తగలగానే దౌర్జన్యానికి పూనుకుంది.

ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధానికి (1914-18) పూర్వం జపాన్‌కింత వ్యాపారంలేదు. ఆ యుద్ధంలో పాశ్చాత్య పారిశ్రామిక దేశాల కుతికవరకు మునిగియున్నప్పుడు జపాన్ ఆ సదవకాశాన్ని చాల జాగ్రత్తగా నుపయోగించుకుంది. అందుకే క్రిందిజాబితా నిదర్శనం—

| | దిగుమతి | ఎగుమతి |
|---|---|---|
| 1914 | రూ. 95,00,95,500. | రూ. 91,57,93,000. |
| 1929 | రూ. 358,23,19,000. | రూ. 332,63,68,500. |

ప్రపంచం ఉపయోగించే పట్టుబట్ట మొత్తంలో 70% జపాన్ సరఫరాచేస్తూంది. మంచూరియా 1931-32 లో జపాన్ వశమైంది. మంచూరియాకు 1933 లో జపాన్ ఎగుమతులవిలువ రూ. 54,00,00,000. 1939 లో యీ విలువ

రూ. 231,15,00,000లకు హెచ్చింది. మంచూరియాను జపాన్ ఆక్రమించిందన్న కోపంతో చైనా, జపాన్ వస్తువుల బహిష్కరించింది. 1931లో చైనాకు జపాన్ రూ. 75,00,00,000 విలువగల వస్తువుల నెగుమతి చేసింది. బహిష్కరణ ఫలితంగా 1933 లో ఎగుమతులవిలువ రూ. 19,50,00,000 కు తగ్గింది. చైనా తన్ను బహిష్కరిస్తూందన్న నెపంతో జపాన్ 1937 లో చైనాను దండెత్తింది. 1933-36 లో జెహెూల్, చారర్, హూపె, సుయన్ మొదలైన చైనా రాష్ట్రాల నాక్రమించింది. ఈ ఆక్రమణవల్ల 1937 లో చైనాకు పంపిన ఎగుమతులవిలువ రూ. 22,50,00,000 లకు హెచ్చింది. చైనాయుద్ధం ప్రారంభమైనతర్వాత, మారణయంత్ర సామగ్రి ఉత్పత్తి ఎక్కువైనందున జపాన్ప్రజల కొనుగోలు శక్తి 40% తగ్గింది.

## పరిశ్రమలు

తమ పేదరికం హెచ్చుకావడంవల్ల, యింటినిండా పిల్లలుండడంచేత, వారిని పోషించలేక చిన్నతనాన్నే పరిశ్రమలలో కూలీకి పంపుతారు. నేడు జపాన్ పరిశ్రమలలో కూలీ చేస్తూన్న పసిపిల్లల సంఖ్య—14 ఏండ్లకు తక్కువ వయస్సు గలవారు—10,00,000. జపాన్ పరిశ్రమలలోని ప్రత్యేకత యీ పసిపిల్లలచేత కూలీ చేయించడం, చౌకకూలీ. జపాన్లో శ్రామికులకు రోజుకు 4 అణాలు మొదలుకొని రు 1-8-0 వరకు కూలీలిస్తారు. ఆడవారికి కూలీలు యింకా తక్కువ.

1926లో అమలులోకి వచ్చిన ఫాక్టరీ చట్టాన్ననుసరించి 16 ఏండ్లుమించని పిల్లకాయలు, స్త్రీలు రోజుకు 11 గంటలకెక్కువ పనిచేయగూడదు. కానీ యీ చట్టాన్ని ప్రభుత్వం నిష్కర్షగా అమలులో నుంచడంలేదు. ఇప్పటికి కొన్నిచోట్ల స్త్రీలచేత, పసిపిల్లలచేత రోజుకు 12 - 14 గంటలు కూలీచేయిస్తున్నారు. శ్రామికులు యింతటి నికృష్ట జీవితాన్ననుభవిస్తున్నా పెట్టుబడిదారుల ఆదాయాలు ఒక్క పిసరైనా తగ్గలేదు. 1932లో ప్రత్తిపరిశ్రమలోని లాభాలు 15%. ఈ లాభాలు 1936 లో 20% కు హెచ్చినై. 1936 లో జపాన్ పరిశ్రమలన్నిటి సగటు లాభం ఉత్పత్తిలో 15%. ఉత్పత్తి, లాభాలు యింత అభివృద్ధిచెందినా శ్రామికులగతి పూర్వంలాగే ఉంది.

ప్రజలలో 21% పరిశ్రమలలో పనిచేస్తున్నారు. నానాటికి జపాన్‌పరిశ్రమలు అభివృద్ధి చెందుతునే ఉన్నాయి. 1936 లో అన్నిదేశాలకన్నా హెచ్చు ప్రత్తిబట్టను జపాన్ ఎగుమతిచేసింది. కానీ 1937 నుంచి చైనాయుద్ధం కారణంగాను, ఇతరదేశాల కెగుమతిసౌకర్యాలు తగ్గడంవల్లను జపాన్ కొనుగోలు - వస్తూత్పత్తికన్నా భారపరిశ్రమల నెక్కువగా అభివృద్ధి చేసింది. పెద్దపెద్ద పరిశ్రమలన్నీ ప్రభుత్వా, జైబెట్సుసొమ్మయి ఉన్నాయి.

1868 విప్లవానంతరం పారిశ్రామికవిప్లవాన్ని సాగించను ఎంతోడబ్బు కావలసివచ్చింది జపాన్‌కు. వ్యక్తులుగాని, వ్యాపారసంస్థలుగాని యింతడబ్బును ఒక్కమారు సరఫరా చేయలేకపోయినందున ఇంగ్లండు మొదలైనదేశాలనుంచి

అప్పుతీసుకొని ప్రభుత్వమే పరిశ్రమల నెలకొల్పింది. కొన్ని ముఖ్యపరిశ్రమలు-ప్రత్తి నేత-మొదటినుంచి ప్రభుత్వాంసామ్యై యున్నందున నేడు నిరంకుశత్వాన్ని సులభంగా స్థాపించను వీలైంది. మొదట్లో రైల్వేలు, టెలిగ్రాఫ్, టెలిఫోన్ మొదలైన సంఘసేవకైన పరిశ్రమలను ప్రభుత్వం ప్రారంభించింది. గనులు, ఆయుధోత్పత్తి,నౌకానిర్మాణం, బ్యాంకులు, లోహపు పరిశ్రమ మొదలైనవాటిని సాగించను వ్యాపారసంస్థలకు డబ్బు అప్పిచ్చి ప్రోత్సహించింది. కొంతకాలమైనతర్వాత జబైట్సు ప్రభుత్వోద్యోగులకు లంచమిచ్చి కొన్నిపరిశ్రమలను ప్రభుత్వంనుండి కొనుక్కుంది.

1931 లో జపాన్‌పరిశ్రమల ఉత్పత్తి విలువ రూ. 750,00,00,000 మాత్రమే. ఈ ఉత్పత్తి విలువ 1938లో రూ. 3,000,00,00,000 లకు హెచ్చింది. 1935 లో యీ విలువ రూ. 1,626,90,00,000 మాత్రమే. ఇందులో బట్టలు మాత్రం 31%; లోహపరిశ్రమలు 17%; ఇంజనీరింగ్ శాఖ 14%; రసాయనపరిశ్రమలు 17%. 1938 లో చైనా యుద్ధ ఫలితంగా మిల్లులనుండి శ్రామికుల ననేకులను ఇనుప కర్మాగారాలకు మార్చారు. 1938 లో పనిచేసిన శ్రామికులలో లోహపు పరిశ్రమలలో 23%; నేతమిల్లులలో 19%; రసాయనపరిశ్రమలలో 19%; యంత్రోత్పత్తి పరిశ్రమలలో 18% చొప్పున పని చేశారు.

1929 లో పరిశ్రమల ఉత్పత్తి 100 అనుకుంటే 1936 లో యీ ఉత్పత్తి 150 కి పెరిగింది. ఇదేసమయంలో కొనుగోలు వస్తూత్పత్తిపరిమితి 33% తగ్గింది. ఉత్పత్తి మొత్తం

విలువ యిదేసమయంలో 37% హెచ్చింది. యుద్ధపరికరాల ఉత్పత్తి యీరోజుల్లో అపరిమితంగా పెరిగింది.

1,00,000 జనాభాగల నగరాలు 1935 లో 34 మాత్రమే ఉండేవి. ఈ నగరాలజనాభా దేశం జనాభామొత్తం లో 25% మాత్రమే 1940 లో ఈనగరాలసంఖ్య 45 కు పెరిగింది. వీటిమొత్తం జనసంఖ్య 2,13,00,000. 1930 లో జనాభాలో 18% మాత్రమే నగరనివాసులు. 1940 లో వీరి సంఖ్య 30%కు హెచ్చింది. ఈ పదేండ్లలో గ్రామీయులు తమవూళ్ళలో బతకలేక నగరాలకు లేచిపోయారు. దీనిని బట్టి పల్లెటూళ్ళలో దరిద్రమెంత హెచ్చిందీ విశదమౌతుంది.

పాశ్చాత్యదేశాలవలెగాక జపాన్‌లో గృహపరిశ్రమ లెక్కువ. ఈ గృహపరిశ్రమలలో సాధారణంగా కొద్దిమంది కూలీలను నియోగిస్తారు. 5 గురులేక 5 గురికన్నా తక్కువ కూలీల నుపయోగించే గృహపరిశ్రమలలో దేశంలోని శ్రామికులందరిలో 50% పనిజేస్తున్నారు. జపాన్ ఎగుమతి చేసే తిండిపదార్థాల్లో 60% యీ గృహపరిశ్రమల ఉత్పత్తే. ఈ గృహపరిశ్రమలన్నీగూడా విద్యుచ్ఛక్తిసాయంతోనే జరుపబడుతున్నై. విద్యుచ్ఛక్తిదీపాలు, రబ్బరువస్తువులు, పిల్లల ఆటవస్తువులు, సైకిళ్లు, పింగాణీవస్తువులు, ఉన్ని-పత్తి ఉడుపులు, జపాన్‌స్త్రీ లుపయోగించే అంగీలు (కిమోనోలు) పాదరక్షలు (గెట) యీ గృహపరిశ్రమల ముఖ్యోత్పత్తి. జపాన్ ఎగుమతివ్యాపారంలో ఎక్కువభాగం యీ గృహపరిశ్రమల ఉత్పత్తే. చైనా యుద్ధం ప్రారంభమైనప్పటినుంచి

యీ గృహపరిశ్రమలలోని శ్రామికుల ననేకులను అధికార వర్గం సైన్యంలో చేర్చారు.

## కార్మికోద్యమం

జపాన్ ప్రభుత్వం—అందున అధికారవర్గం కార్మికసమస్యలపట్ల యెలా ప్రవర్తిస్తూంది గమనించడ మవసరం. మొదటిసారి ఎన్నికలు 1890 లో జరిగాయి. అప్పట్లో జపాన్ కార్మికుల కెంతో సేవచేసిన సెన్ కట యామ, ఆతని అనుచరులుగలిసి కార్మికోద్యమాన్ని ప్రారంభించారు. 1891 లో సోషల్ డెమొక్రాటిక్ పార్టీ (సాంఘికప్రజాస్వామ్యకక్షి) ప్రారంభింపబడ్డది. కానీ వెంటనే ఆ పార్టీని ప్రభుత్వం నిషేధించింది. 1894-5 లో జరిగిన చైనా-జపాన్ యుద్ధసమయంలో కార్మికోద్యమం చక్కగా అభివృద్ధిచెందింది. 1895 లో చైనానుండి కొరియాకు జపాన్ స్వాతంత్ర్యాన్ని సంపాదించియిచ్చింది. 1897 లో 'రైల్వే కార్మికసంఘం' ఒకటి స్థాపించబడింది. సమ్మెలు జయప్రదంగా సాగినై. ఈ కార్మికసంఘాలను అణగద్రొక్కను 1900 లో ప్రభుత్వం కార్మికసంఘాలను నిషేధిస్తూ శాసించింది. 1904-5 లో సేనానాయకులు రష్యా-జపాన్ యుద్ధంలో నిమగ్నులై యున్నందున కార్మికసంఘాలు తమప్రచారాన్ని శ్రామికుల్లో అతి తీవ్రంగా వ్యాపింపచేసినై. 1906 లో జపాన్ సోషలిస్టుపార్టీ స్థాపించబడ్డదికాని ఒకస వత్సరంలోగా యమగండం కల్గిందాపార్టీకి. 1911 లో బున్ జి సుజికి 'మిత్రసంఘం' అన్న పేర నొక కార్మిక

కక్షిని ఏర్పాటుచేశాడు. ప్రభుత్వం చూస్తూ ఊరుకుంది. 1914-18 యుద్ధంవల్ల జపాన్ ధనికవర్గానికి అపారమైన లాభాలు చేకూరాయిగాని ప్రజలకు కాటకాలు, కరువులు కూడా సమకూరినై. బియ్యం కరువైనందున బియ్యంకొరకు ప్రజలు తిరుగుబాట్లు సాగించారు. కార్మికనాయకుడు సెన్ కటయామా అమెరికాకు పరిగెట్టాడు. అతను 1933 లో మాస్కోలో చనిపోయాడు.

1914-18 యుద్ధానంతరం విజ్ఞులు, విద్యావంతులు— ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లో, కళాశాలలలో ఆచార్యులు—మార్క్సిజాన్ని చదువ నారంభించారు. 1920 లో మొదటి సారి 'మేడే' ఉత్సవాలు జరిపారు. 1921 లో మేడే ఉత్సవాలప్పుడు 200 మంది కార్మికోద్యమనాయకులను ప్రభుత్వం అరెస్టుచేసింది. ఒకనాయకుడు పోలీసుకాల్పులకు గురియై చనిపోయాడు.

---

# 5. ముమ్మందు.

## సమస్యలు

**జనాభా సమస్య :**

జపాన్ ఎదుర్కోవలసివచ్చిన సమస్యలలో కష్టతరమైనది జనాభా సమస్య. ఈనాటి జపాన్ సామ్రాజ్యకాంక్షకు ముఖ్యకారణం యీ సమస్యేనని అధికారవర్గం అంటూంది. 1941 ఏప్రిల్‌లో ప్రభుత్వం ప్రకటించిన లెఖ్ఖలనుబట్టి జపాన్, కొరియా, ఫర్మోజా, సాఖలిన్, క్వాంటంగ్, దక్షిణ సముద్ర ప్రాంత రాష్ట్రాలు — వీటన్నిటి జనాభా మొత్తం 10,50,00,000 లకు తగ్గదు. ఇందులో వలస రాజ్యాలుగాక జపాన్ జనాభామాత్రం 7,50,00,000. దేశమంతా ఒక్క భూభాగంగా నుండక 600 దీవులుగానుండడం, చాలవరకు దేశం పర్వతమయంగా నుండడం, అతి ప్రమాదకరమైన అగ్నిపర్వతాలు దేశమంతటా నుండడం కారణంగా జపాన్ విస్తీర్ణంలో 34% మాత్రమే వ్యవసాయానికి లాయకైన భూమి. ప్రస్తుతం యిందులో సగపాలుమాత్రమే సాగుబడికింద నుంది.

జపాన్‌లో జనసమర్ధ మెక్కువ. ఇతర దేశాలతో పోల్చిచూద్దాం—

| దేశం. | చదరపుమైలుకు జనాభా. |
|---|---|
| బ్రిటన్ | 2,170 |
| బెల్జియం | 1,790 |
| జర్మనీ | 806 |
| అమెరికా | 229 |

| దేశం. | చదరపు మైలుకు జనాభా |
|---|---|
| జపాన్ | 2,774 |
| ఆస్ట్రేలియా | 13 |
| కనడ | 24 |

ఇందుకు తోడు జపాన్ జనాభా సాలీనా 9,00,000 చొ॥ హెచ్చుతూనే ఉంది. ఈ అపార జన బాహుళ్యానికి కూడు, గుడ్డ సమకూర్చను ఏ ప్రభుత్వమైన అవలంబింపదగిన మార్గాలు రెండుమాత్రమే — దేశంలోని వర్గం సంబంధాలను మార్చివేయడం, లేదా వలస రాజ్యాలను అపారంగా సంపాదించడం.

1868 లో జరిగిన బూర్జువా విప్లవం ఫలితంగా పెట్టుబడిదారి విధానం జమీందారీ విధానాన్ని ధ్వంసంచేసి అధికారానికొచ్చింది. జమీందారీ వర్గంనుండి అధికారాన్ని లాక్కోను చేసిన మహాప్రయత్నంలో శ్రామికవర్గం ఎంతో పాటుబడ్డదిగాని యీ విప్లవ ఫలితాలు కేవలం ధనికవర్గమొక్కదానికే దక్కాయి. అందువల్ల దేశంలోని వర్గసంబంధాలు పూర్వంలాగా వుండిపోయినై. కాకుంటే, భూస్వాములు బదులు వడ్డీ వ్యాపారస్థులు అధికారానికొచ్చారు. సమూరేల పలుకుబడి మునుపటికన్నా హెచ్చింది. పూర్వం వారు కేవలం స్వచ్ఛంద సేవకులు-వారి యజమాన్ల కొలిచ్చే వారు. ఇప్పుడు వారు ప్రభుత్వోద్యోగులయ్యారు. సైన్యంలో వారి పలుకుబడి అపారం. చక్రవర్తిని కొల్వనారంభించారు. వర్గసంబంధాలు యథారీతి నుండడంవల్ల సాలీనా 9,00,000 చొప్పున హెచ్చుచున్న జనాభాను పోషించను

జపాన్ విదేశాల దండెత్తాల సొచ్చింది. అందుకే యీ యుద్ధం.

1937లో జనాభివృద్ధి మితిమీరిపోయింది-10,00,000. 1937లో చైనాను దండెత్తింది జపాన్. అప్పటినుంచి యీ జనాభివృద్ధి క్రమేణా తగ్గింది. ఈ 5 ఏండ్ల చైనా - జపాన్ యుద్ధంలో 12,00,000 జపాన్‌వారు చచ్చారు. ఈ చావులు కారణంగా దేశంలో పుట్టుకలు తగ్గినై. ప్రస్తుతం జనాభివృద్ధి తగ్గుతూందన్న నెపంతో మొన్నటివరకు "మా జనాభా హెచ్చుగా ఉంది. మాకు వసనరాజ్యాలు కావాలి" అన్న జపాన్ అధికారవర్గం నేడు "మన జనాభా తగ్గుతూంది. విరోధులు మన దేశాన్ని చుట్టుముట్టున్నారు. మన జనాభివృద్ధిని హెచ్చించాలి" అని ప్రచారాన్ని సాగిస్తూంది.

తన జనాభాలో హెచ్చుగానున్న సంఖ్యను యితర దేశాలకు వలస పంప జపాన్ ప్రయత్నించింది. వలస పోవడానికి జపాన్‌వారికి కొన్ని అడ్డంకులున్నాయి. స్వతహా వారికి మాతృదేశమంటే మహాప్రేమ. తమ దేవాలయాలను, తమ పర్వాతాలను, తమ ప్రకృతి సౌందర్యాన్ని విడిచి యితర దేశాల్లో కాపురముండడానికిన్నా మాతృ దేశంలోనే ఉండి చావడం ఉత్తమంగా భావిస్తున్నారు. అంతగా వారి దేశనాయకులబలవంతంమీాద వారు వలసబోయినా యితర దేశాలు వారిని తమ దేశంలోకి రానివ్వడంలేదు.

1924 లో అమెరికాలోకి జపాన్‌వారు వలస రాకుండా నూతన చట్టాన్ని అమలులోకి దెచ్చారు. ఇతర పారిశ్రామిక దేశాల్లో స్వతహా జనాభా హెచ్చుగానే ఉంటూ

ఉంది. వ్యవసాయిక దేశాలకు వలసబోయి నికృష్ట పేదరికంలో కృశించడం జపానీయుల కిష్టంలేదు.

తమ మాతృదేశంమీద వారికిగల అవ్యాజానురాగం కారణంగా వలసరాజ్యాలు లభించినా వలసబోయేవారి సంఖ్య స్వల్పం. ఇప్పటికి 30 ఏండ్లుగా మంచూరియా జపాన్ వారి పలుకుబడికి లోబడియుంది. అట్లయినగూడా ఆ దేశానికి వలసబోయినవారి సంఖ్య 2,00,000లకు మించదు. 1931-38 లో తమ అధికారంలోనున్న మంచూరియాకు 30,000 మాత్రమే వలసబోయారు. సాలీనా జపాన్‌నుండి యితర దేశాలకు వలసపోయేవారి సంఖ్య20,000 లకు మించదు. ఇందులో 10,000 లకుపైగా సాలీనా దక్షిణ అమెరికాకు వలసబోతున్నారు. మిగత 10,000 కనడా, మంచూరియా, పసిఫిక్ దీవులలో నివాసాలేర్పరచుకుంటున్నారు.

ఇతర దేశాలకు వలసబోయినా మాతృదేశంమీదనున్న ప్రేమకారణంగా జపాన్‌వారు దేశపు ప్రభుత్వాన్ననుసరించి నడుచుకోరు. ఇందుకు నిదర్శనం హవాయి దీవులకు వలసబోయిన జపాన్‌వారి ప్రవర్తనే. హవాయిదీవులు అమెరికాకు చెందినవి. పసిఫిక్ మహాసముద్రంలో నున్నవి. ఈ దీవులకు వలసవచ్చిన యితర ప్రజలలాగా గాకుండా జపాన్‌వారు స్థిరనివాసాలేర్పరచుకున్నా తాము మికాడో ప్రజలని, ఎక్కడో నున్న జపాన్‌పౌరులని మరువరు. ఈ వలసదేశానికి ద్రోహం చేయడానికి ఎంతమాత్రం వెనుదీయరు. అందువల్లే పాశ్చాత్యదేశాలు వలసవచ్చిన జపాన్‌వారిని పంచమ దళంగా పరి

గణిస్తారేకాని వీరిని తమ నమ్మకమైన పౌరులుగా పరిగణించడం లేదు.

1900 లో హవైలో 12,360 మంది జపానీయు లుంటూవచ్చారు. 1920లో వీరిసంఖ్య 1,09,274 కు పెరిగింది. మొత్తం జనాభాలో వీరిసంఖ్య 43%. హవైలోనున్న అమెరికన్లతో పోలిస్తే జపాన్‌వారు 10 యింతలు ఎక్కువున్నారు. జపాన్‌పిల్లలు తమ ప్రత్యేకపాఠశాలల్లో జపాన్ భాషను నేర్చుకుంటున్నారు. ఈ అవకాశంవల్ల జపాన్‌పట్ల ప్రేమ, మికాడో పట్ల భక్తి హెచ్చడానికి వీలైంది. ఈ పాఠశాలల మూలంగానే అమెరికాపట్ల యీ జపానీయులలో ద్వేషం పుట్టుతూంది. హవైలోని జపాన్‌వారు పేరుకు అమెరికాపౌరులు. పౌరసత్వహక్కులు వారికున్నై. కానీ వారిప్రేమ జపాన్‌పైనే. ఇట్టిప్రవర్తనఫలితంగా జపాన్‌వారినే స్వాతంత్ర్యదేశం రానివ్వదు.

1902 లో పుట్టుకలను నిరోధించాలని ప్రచారం ప్రారంభమైంది. కానీ ప్రభుత్వం యీ ప్రచారానికి విముఖమైంది. 1922 లో గర్భనిరోధక పరికరాలనమ్మడం నేరమని శాసించబడ్డది. 1902—20 లో పుట్టుకల నిరోధించాలన్నప్రచారం చక్కగా సాగినా ప్రజలసఖ్య హెచ్చుతూనే ఉంది. 1941 లో ప్రభుత్వం ప్రస్తుతం జరుగుచున్న చైనాయుద్ధంలో కల్గిన జననష్టాన్ని పూడ్చను 'దశవర్ష జనాభా ప్రణాళిక' నొకదానిని అమలులోకి తెచ్చింది. ఈ నూతనప్రణాళిక ననుసరించి ప్రతికుటుంబంలో కనీసం 5 గురు పిల్లలుండాలని నిర్ణయించబడ్డది. ఈ నిర్ణయప్రకారం సాగితే జపాన్ జనాభా

(సామ్రాజ్యంతో నిమిత్తంలేకుండా) 1960లో 10,00,00,000 కాగలదు. ప్రభుత్వం యిటీవలే యీ ఉత్తర్వు చేసింది—

"జపాన్ ప్రజలు ఆసియా ఖండానికి నాయకులు కావాలంటే వారి సంఖ్య హెచ్చాలి. అతి శీఘ్రంగా హెచ్చాలి. గర్భ నిరోధక విధానం నాశనం చేయబడాలి. కుటుంబంయొక్క, జాతియొక్క ప్రాముఖ్యతను ప్రజలకు బోధించాలి. శీఘ్రవివాహాలు, బహుసంతానం ప్రోత్సహింపబడాలి."

**ముడివస్తువులు :**

జపాన్ యిప్పటికి వ్యవసాయ దేశమేనని గమనించాం. కాని వ్యవసాయం అట్టే లాభకరంగాదు గనుక పరిశ్రమ లెక్కువగా నున్నాయి. ఈ పరిశ్రమల ఉత్పత్తి నమ్మను బజార్ల కోసం దురాక్రమణ నారంభించింది. ప్రతి పారిశ్రామిక దేశానికి రెండుసమస్య లుంటాయి సహజంగా. ఈ రెండూ ఒకసమస్యకే రెండువైపులు. ప్రతి పారిశ్రామిక దేశం తన పరిశ్రమలసాగించడానికి ముడిపదార్థాలకు ఇతర దేశాలమీద ఆధారపడాలి. ఈ ముడివస్తువుల సరఫరాచేసే దేశాలకే సాధారణంగా తమ పరిశ్రమల ఉత్పత్తి ఫలితాల నెగుమతి చేస్తారు. జపాన్‌కీసమస్య చాల కష్టసాధ్యమైనది. తన పరిశ్రమలు సాగించడానికి ముడివస్తువుల సరఫరాచేయను, తన పరిశ్రమ లుత్పత్తిచేసిన వస్తువులకొనను వ్యవసాయక దేశాలు కావలసొచ్చినై. జపాన్ నిద్రబోతూన్నప్పుడు వ్యవసాయక దేశాలన్నిటిని పాశ్చాత్య సామ్రాజ్యవాదులు పంచుకున్నారు. వారినుండి కొన్ని దేశాలను లాక్కోవూనింది జపాన్.

జపాన్‌లో ముఖ్యపరిశ్రమలు, వాటికైన ఫాక్టరీలు,

ఆ పరిశ్రమలలో పనిచేస్తూన్న శ్రామికులు మొదలైనవివరాలు (1932 లో) యీక్రింద యివ్వబడ్డవి—

| పరిశ్రమ. | ఫాక్టరీల సంఖ్య. | శ్రామికుల సంఖ్య. |
|---|---|---|
| నేత (పట్టు-పత్తి) | 19,706 | 9,97,690 |
| మరల ఉత్పత్తి | 3,782 | 90,939 |
| రసాయన పరిశ్రమలు | 3,199 | 1,22,250 |
| ఆహార పరిశ్రమలు | 11,894 | 1,42,998 |
| యంత్రాలు-చేతిపనిముట్లు | 5,296 | 1,90,154 |
| మట్టి పరికరాలు | 3,253 | 70,117 |
| కలప పరిశ్రమ | 4,730 | 58,996 |
| అచ్చు పరిశ్రమ | 2,586 | 52,015 |
| విద్యుచ్ఛక్తి | 457 | 8,038 |
| ఇతర పరిశ్రమలు | 4,984 | 91,825 |
| మొత్తం 10 పరిశ్రమలు | 59,887 ఫాక్టరీలు | 18,24,022 కూలీలు |

ఫాక్టరీలలో రమారమి 3 వ వంతు, శ్రామికులలో సగానికంటే ఎక్కువమంది నేతపరిశ్రమలో పనిచేస్తున్నారు. నేత పరిశ్రమలో పట్టు, పత్తి ముఖ్యమైనవి. ముడిపట్టు జపాన్‌లో కావలసినంత దొరుకుతుంది. పత్తి జపాన్‌లో పండదు. ఇండియా, ఈజిప్టు మొదలైన దేశాలమీద జపాన్ ఆధారపడుంది. పత్తి-బట్టను విక్రయించనుగూడా యీ దేశాలనే నమ్ముకుంది.

1912 లో భారతదేశం కారెకం బట్టలను 98% బ్రిటనునుండి, 1% జపాన్‌నుండి దిగుమతిచేసింది. 1929-31లో భారతదేశం యీ బట్టలనే జపాన్‌నుండి 43% బ్రిటన్‌నుండి 56% దిగుమతి చేసింది. దీన్నిబట్టి గడచిన యుద్ధా

నంతరం జపాన్ ఎగుమతి అపరిమితంగా హెచ్చిందని,జపాన్ వస్తువులెక్కువగా ప్రాగ్దేశాల్లోనే అమ్ముడుబోతున్నవని విశదమౌతుంది. వ్యవసాయానికిపిదప జపాన్‌లో నేతపరిశ్రమదే అగ్రస్థానం. పత్తిపంట జపాన్‌లో లేదుగనుక యీ ముడివస్తువుకు యితరదేశాలమీదే ఆధారపడాలి. ఇతరదేశాలు జపాన్‌కు ముడిపత్తిని సరఫరాచేసినందుకు జపాన్ బదులేమివ్వగలదు? జపాన్ బియ్యం జపానుకేచాలదు. ఇతర దేశాలేవి యీ పంట నాశించడంలేదు. ఎంతకాలం డబ్బిచ్చి కొంటుంది ?

నేతపరిశ్రమకుపిదప దేశంలో గొప్పపరిశ్రమ లోహపరిశ్రమ. (ఇంజనీరింగు పరిశ్రమ) ఈ పరిశ్రమలో 1929 లో 1,610 కంపెనీ లున్నాయి. వీనిలో 308 విద్యుచ్ఛక్తి పరికరోత్పత్తిని, 390 యంత్రనిర్మాణాన్ని, 83 నౌకానిర్మాణాన్ని సాగిస్తున్నాయి. ఇటీవల జపాన్ యుద్ధపరిశ్రమలు ఎక్కువగా పెరగడంచేత మోటార్లు, విమానాలు, టాంకులు మొదలైన మారణయంత్రాల ఉత్పత్తికి కావలసినంత ముడిపదార్థాలు జపాన్‌కు దొరకడంలేదు. అందుకనే విమానాలను, మోటార్లను విదేశాలనుండి దిగుమతిచేస్తూంది. 1935 లో జపాన్‌లో 1,00,000 మోటారుబండ్లున్నాయి. వీటిలో 80,000 అమెరికానుండి దిగుమతి చేయబడినవి. ఫోర్డు, జనరల్ మోటార్సు కంపెనీలు జపాన్‌లో తమశాఖలను స్థాపించినై.

ఖనిజసంపద జపాన్‌లో చాలకొద్ది. ముడిఇనుము, నేలబొగ్గులకు మంచూరియా, పెట్రోలియంకు డచ్చి తూర్పు ఇండియాదీవులమీద జపాన్ ఆధారపడుంది. రబ్బరుకు

మలయా, పంచదారకు జావ మీద నాధారపడుంది. తనకు గావలసిన ముడిపదార్థాలన్నీ తన దేశాన్నానుకొనియుండు దేశాల్లోనే తనకు దొరుకుతున్నాయి. ఈదేశాలు పారిశ్రామికంగా అభివృద్ధిచెందలేదు గనుక తాను తయారుచేసిన వస్తువులను సులభంగా యీదేశాల్లో అమ్ముకోవచ్చు. కాని యీ దేశాలన్నీగూడ పాశ్చాత్య సామ్రాజ్యవాదులసొమ్మై పోయినై. పాశ్చాత్యులచేతులనుండి యీదేశాలను సామ, దాన, భేద, దండోపాయాలతో లాక్కోడమే జపాను ఆశ. ఈ విషయాన్నిగురించి 'టనక' విజ్ఞప్తి విశదీకరించింది.

వర్గసంబంధాలు :

జనబాహుళ్యం హెచ్చుతూనేఉన్నా దేశంలోని ధనికుల ఆదాయం అపరిమితంగా పెరుగుతూనే వుంది. కష్టజీవుల ఆదాయం క్రమేణా తగ్గుతూనేవుంది. ఇటీవల కొనుగోలు వస్తూత్పత్తికన్నా ఉత్పత్తిపరికరాలఉత్పత్తి హెచ్చుగా సాగుతూంది. 1938 లో కొనుగోలు వస్తూత్పత్తి, ఉత్పత్తి పరికరాలఉత్పత్తి రెండుగూడా 100 అనుకుందాం. 1940 లో కొనుగోలు వస్తూత్పత్తి 82 కు తగ్గింది. కాని ఉత్పత్తి పరికరాలఉత్పత్తి 111 హెచ్చింది.

ప్రపంచంలోని అన్ని పెట్టుబడిదారి దేశాలలాగా జపానులోగూడా మూడువర్గాలున్నాయి. ధనికవర్గం, పెటీబూర్జువాజి, (మధ్యరకం) శ్రామికవర్గం. ఈ మధ్యరకం ప్రజలు తమ అనుకూలాన్నిబట్టి ఏదో నొకవర్గంతో తాత్కాలికంగా చేతులుగల్పుతారు. 1868 విప్లవమప్పుడు మధ్య తరగతి ప్రజలు, శ్రామికులుకలసి పోరాడారు జమీందారీవిధానానికి

వ్యతిరేకంగా. అప్పట్లో ధనికవర్గంగూడా వీరితో గలసి అధికారవర్గాన్ని తొలగించింది. పిదప ధనికవర్గం తనే అధికారవర్గమైంది. మధ్యతరగతి నేడు ధనికులతో గలసి శ్రామికులను దోచుకుంటూంది. నేటి జపాన్ సైన్యం మధ్యతరగతి ప్రజలకు జీవనాధారంగా నుంది. అందువల్లే వారు అధికారవర్గానికి (ధనికవర్గానికి) తోడ్పడడమేగాకుండా సామ్రాజ్యవాద యుద్ధాలకు సన్నద్ధులయ్యున్నారు.

జపాన్ జాతీయసంపదలో ఎంతభాగం? జాతీయాదాయంలో ఎన్నోవంతు? ధనికవర్గం అనుభవిస్తూంది, శ్రామికులనుభవిస్తూంది లెఖ్ఖగట్టడమంత సులభంకాదు. జపాన్‌లో 900 కుటుంబాలు దేశసంపదను హస్తగతం చేసుకొనున్నాయి. కానీ వీనిలో పెద్దవి, ముఖ్యమైనవి, అపారధనసంపన్నమైనవి 8 కుటుంబాలుమాత్రమే. దేశంలోని ఉత్పత్తి, పంపకం, పెట్టుబడి మొదలైన జీవనాధారవిధానాలన్నీ యీ కుటుంబాలచేతుల్లోనే ఉన్నాయి. ఈ 8 కుటుంబాలు మిట్సుయి, మిట్సుబిషి, సుమిటొూయొ, యసుడ, సుజుకి, షి బుసవ, అసానో, ఒకూరా అన్నవి. బ్యాంకులలోని సగండబ్బు వీరిది. గుత్త వ్యాపారసంస్థ ఆస్తులలో ¾ వంతు వీరిది. భీమా కంపెనీలు అచ్చుకోవలసిన (భీమాచేయుబడ్డ మొత్తాలు) డబ్బులో ¼ వంతు వీరిది.

గనులలో, విదేశవ్యాపారంలో ఎక్కువ పెట్టుబడి పెట్టింది మిట్సుయి కుటుంబం. ఈ కుటుంబం పెట్టుబడి హెచ్చుగా చైనాలో నుంది.

యసుడకుటుంబం బ్యాంకుల్లో, వలస రాజ్యాల్లో ఎక్కువ పెట్టుబడి పెట్టింది.

మిట్సుబిషి కుటుంబం నౌకా నిర్మాణంలో, ఇంజనీరింగ్ శాఖలో, నగరాల్లోని నివేశనాల కొని అమ్మడంలో ఎక్కువ ఆసక్తికల్గి ఉంది.

ఉత్తర చైనాలోని గనులు, ఫాక్టరీలు, చమురు బుగ్గలు, బంగారం, అల్యూమీనియం మొదలైన పరిశ్రమలలో $\frac{3}{4}$ వంతు మిట్సుయి, మిట్సుబిషి కుటుంబాల చేతుల్లోనున్నది. జపాన్‌లో ఉత్పత్తిఅయ్యే మొత్తం రాగిలో 99% మిట్సుబిషి ఉత్పత్తిచేస్తుంది. జపాన్‌లోని పట్టు, పంచదార, రసాయన పరిశ్రమలు, రాకపోకల సౌకర్యాలు పూర్తిగా మిట్సుయి, మిట్సుబిషి కుటుంబాల చేతుల్లోనున్నై. పెద్ద పరిశ్రమలలో ఒక్క నేత (ప్రత్తి) పరిశ్రమమాత్రం జైబెట్సుచేతిలో లేదు.

మిట్సుయి కుటుంబం యిప్పటికి 300 యేండ్లక్రితం స్థాపించబడ్డది. ఈ కుటుంబంలో పుట్టే ప్రతివాడు 300 ఏండ్ల క్రితం తనపెద్దలు నిర్ణయించిన కట్టుబట్టాలననుసరించి నడుచుకుంటానని తన పితృదేవతల సమాధిముందు సాష్టాంగపడి ప్రమాణంచేయాలి. ఈ కుటుంబానికి ప్రస్తుతం పెద్దయిన మిట్సుయి ప్రభువు ఆస్థివిలువ నేడు రూ 150,00,00,000. 200 కంపెనీలు, 1,300 వ్యాపార సంస్థలలో భాగం యీతని సొమ్ము. ఈ కుటుంబం పెట్టుబడి మొత్తం రూ 9,00,00,000. సాలీనా యీ కుటుంబాదాయం రూ 4,50,00,000.

రైతుకుటుంబాల సాలీనాసగటు ఆదాయం రూ 375 మాత్రమే. అందులో సగం కౌలుకింద యిచ్చుకోవాలి

భూస్వామికి. రైతు కుటుంబాలన్నిటి మొత్తం ఋణం రూ 750,00,00,000. అని ప్రభుత్వం యిటీవలే ప్రకటించింది కాని యిది నిజంగాదు.

జపాన్ ప్రజల్లో 85% మందిరొక్క వ్యక్తిగత ఆస్థి రూ 7,200 మాత్రమే. వారి కుటుంబాదాయం సాలీనా రూ 5,000 లకు మించదు. ప్రభుత్వాదాయంలో 57% వీరి నుంచే వసూలు చేయబడుతూంది.

1938లో టోకియోలోని శ్రామికుని సగటు ఆదాయం రూ 100 మాత్రమే. 1938లో మిట్సుయి గుత్తవ్యాపార సంస్థ ఆదాయం రూ 100,00,00,000.

జపాన్‌లో భాగ్యవంతులకు బీదలకు యీవిధంగా అపరిమిత అంతరాయముండడంచేత కష్టజీవులు కృశించిపోతున్నారు. సామ్రాజ్యం విస్తరిస్తూన్నా, విదేశాల జపాన్ దోచుకుంటూన్నా పారిశ్రామికులగతి దుర్గతిగానే వుంది. శ్రామికుల నీవిధంగా పీల్చి, పిప్పి జేయకపోతే నిన్నటివరకు వెనుకబడియున్న జపాన్ నేడు (50 ఏండ్లలోపున) ప్రపంచ పారిశ్రామిక దేశాల్లో మిన్నయైన ఇంగ్లండు, అమెరికాల నెల ఎదిరించగల్గేది ?

## బాధ్యత

ఈ ఆర్థిక అసమానత్వాన్ని రూపుమాపకపోతే, జపాన్ జనాభాసమస్యను పరిష్కరించకపోతే ప్రపంచంలో యిప్పట్లో శాంతిఏర్పడడం అసంభవం. అచ్చటి అసంఖ్యాకులసమస్యను పరిష్కరించను ముఖ్యమైనమార్గం జపాన్

వారు తక్కువమంది పిల్లల కనేటట్లు చేయడం. వారు తక్కువ మందిపిల్లలను కనాలంటే బియ్యాన్ని ఆహారంగా ఉపయోగించడం కొంతవరకు మానాలి. ఈ రోజుల్లో గోధుమగూడా (బియ్యంలాగే) చౌకగానే దొరుకుతూంది. జపాన్ ప్రజలు గోధుమను ముఖ్యాహారంగా ఉపయోగించేట్లు చేయాలి. ఇందుకు వారు విద్యావంతులయితే చాలదు. ఇప్పటికే జపాన్‌లో నిరక్షరాస్యత లేనేలేదు. వారికి నూతన సంస్కృతిని గరపాలి. వారు వారి కష్టసుఖాలను కేవలం వారి జాతీయదృష్టితో గాకుండా ప్రపంచసమస్యగానే విశాల భావంతో వీక్షించి తమ పూర్వ అలవాట్లను మార్చుకునేటట్లు చేయాలి. వారిలో ఆ మార్పు తేవడం మానవు లందరి బాధ్యత.

ఏ దేశంగాని తన జనసంఖ్య ఎక్కువైనంత మాత్రాన పేద దేశం కాజాలదు. అర్థశాస్త్రరీత్యా ఒక దేశం యొక్క సంపదను లెఖ్ఖగట్టాలంటే మొదట ఆ దేశంలోని మానవులనే లెఖ్ఖలోకి తీసుకోవాలి. 'బహుజన సమస్య' కేవలం పెట్టుబడిదారి ఆర్థిక విధానం సృష్టించేది. ప్రతి మానవునికి—అతడు మానవుడు గనుకనే—శ్రమశక్తి ఉన్నది. ఏదో ఒకవిధమైన ఉత్పత్తిని సాగించగలడు. జపాన్ సమస్య 'బహుజన' సమస్యగాదు. పెట్టుబడిదారి సమస్యే. కొద్దిమంది కోటీశ్వరులు కోటీశ్వరులౌతూనే ఉన్నారు. వారి ఆదాయం నానాటికి హెచ్చుతూనే ఉంది. శ్రామికుల పేదరికమూ హెచ్చుతూఉంది. కష్టజీవుల పేదరికం నానాటికి అభివృద్ధి చెందడానికి కారణం వారి సంఖ్యగాదు—

సాలీనా ఆ సంఖ్య పెరుగుతున్నా. వారి పేదరికానికి కారణం జపాన్ పెట్టుబడుదారుల ఆదాయం ఏయేటి కాయేడు పెరుగుతుండడమే. ఈ పేదరికాన్ని రూపుమాపను జపాన్ మిలిటరీవర్గాన్ని, ధనికవర్గాన్ని ధ్వంసంచేసి శ్రామిక ప్రజారాజ్యాన్ని స్థాపించాలి. అందుకు మొదటిమెట్టు యీ యుద్ధంలో జపాన్‌ను ఓడించడం. జపాన్‌లో విప్లవాన్ని తీసుకురావడం. ఈ పనిని తరతరాలుగా బానిసత్వంలో కృశిస్తూన్న జపాన్ ప్రజలు నిర్వహించలేరు. మానవులందరు యింకుకు పూనుకోవాలి. మిత్రరాజ్యాలీ యుద్ధాన్ని గెల్చినంత మాత్రాన జపాన్ కష్టాలు—ప్రపంచసమస్యలు పరిష్కారంగావు. యుద్ధానంతరం ప్రపంచమంతట శ్రామిక ప్రభుత్వాలు నెలకొల్పబడాలి. అప్పుడుగాని జపాన్ ఫాసిస్టుల గర్వమణగదు, ప్రపంచం శాంతి నొందదు.

---

ఈ రచనకుపయోగించన ఆంగ్ల గ్రంథాలు—


1. Encyclopedia Britannica 14th Edition.
2. Japan's Finance and Industry 1938.
3. Japan's Kampf—Jaya Deva.
4. Japan—Mistress of the Pacific.
5. Profits and Politics in the Post—War World.
6. Secrets of Japan—Chamanlal.
7. The Menace of Japan—Taid O' Conory.
8. The New Japan, Impressions and Reflections.
9. The Post—War World.


---

మా ప్రచురణలు :

# 1. సోవియట్ల దేశం

"...నూతనప్రపంచం, మానవపునరుద్ధరణ, నిర్మాణనాటకం అనే శీర్షికలక్రింద ఈనాటి సోవియట్ రష్యానుగురించి తెలుసుకోనదగిన విషయాలన్నీ యివ్వబడినై. —ఆంధ్ర వారపత్రిక, మార్చి 11, 1942.

"...దీనిలో హీరేణ్ ముఖర్జీ, ఇళా సేణ్, సైల్లా బ్రౌణ్ గార్ల వ్యాసాలున్నవి. తెలుగు తర్జుమాకూడ సాఫీగా ఉంది."

—కార్మిక బులిటెన్, మార్చి 1942.

"...అనువాదం బాగుంది. సాధారణభాషలో, కేవలం తర్జుమా చేయక అనుకరణచేస్తూ మాతృకలోని భావాలనువదలక ప్రధానవిషయాలన్నింటినిచేర్చి చక్కగా వ్రాశారు." —వాహిని, మార్చి 29, 1942.

" మానవస్వాతంత్ర్యంకోసం యీనాడు సోవియట్లు చూపుతూ ఉన్న అఖండప్రతిభనుగురించి తెలుసుకోవడం ప్రతిస్వాతంత్ర్యపిపాసికి కనీస ధర్మమై ఉంది. అట్టిదానికి యీ గ్రంథం మిక్కిలిగా ఉపకరిస్తుంది. అనువాదం సరళంగా వుంది." —ప్రజామిత్ర, ఏప్రిల్ 26, 42.

# 2. ఫ్రాన్స్ పతనం.

ప్రజాస్వామ్యాల నెలకొల్పదలచిన దేశదేశాల ప్రజలూ—అసలు ద్రోహులు యేయే రూపాలలో కుటిల నాటకాలు ఆడుతూ వుంటారో తెలుసుకోవలసినవిధి వుంది అటువంటి అవకాశాన్ని కలుగజేస్తుంది "ఫ్రాన్సుపతనం." ఆంధ్రులు తప్పక చదవాలి."—ప్రజాబంధు ఏప్రిల్ 19,42.

" ఈ గ్రంథంలో ఫ్రెంచి రిపబ్లిక్ నాటినుంచి నేటివరకు రకరకాలుగా మారిన రాజకీయాలు, రంగులు చక్కగా వర్ణించబడినాయి. ఈ యుద్ధంలో కొబ్బరికాయలాగా రెండు చెక్కలై—ఒక చెక్క హిట్లరు చేతిలోపడి, రెండవ చెక్క పెటాను పట్టుకు వ్రేలాడుతున్న సమయంలో, లవెల్ ధిక్కారానికి లోనైన ఫ్రాన్సుకు సంబంధించిన ఈ గ్రంథం ఒక కథకంటె కమ్మగా చదువతగింది." —కృష్ణాపత్రిక ఏప్రిల్ 25, 1942.

"...ఫ్రాన్సుదేశపు ప్రాచీనార్వాచీన చరిత్రయు, ఫ్రాన్సు పతన విశేషములును దీనిలో వివరింపబడినవి. ఇట్టి రాజకీయరచనలు ఈ తరుణములో ఆంధ్ర జనసామాన్యమునకు చాల అక్కరైయున్నవి."

—ఆంధ్ర వారపత్రిక, మే 20, 1942.

ఫ్రాన్సును కబళించడానికి జర్మనీ ఎత్తిన ఎత్తులు, అది అనుసరించిన అమానుష మార్గాలు ఇందు బాగా క్రోడీకరింపబడ్డాయి.

ప్రజాస్వామ్యాలపాలిటి తోకచుక్కలా ప్రవర్తిస్తూవున్న నేటి ఫాసిస్టునాయకుల దౌష్ట్యాలను మనం ముఖ్యంగా తెలుసుకోవాలి. అట్టిదానికి ఈ గ్రంథం బాగా ఉపకరిస్తుంది." —ప్రజామిత్ర మే 24, 42.

" మొట్టమొదట—జ్యోశ్యం తెలిసినట్లుగా విచీ ప్రభుత్వం అన్న పేరుతో మొన్న మొన్నటివరకూ వేరుగా వుంటూవచ్చిన ఆ కాస్త ఫ్రెంచి ప్రభుత్వముకూడా లావెలు కుటిల కుతంత్రాల కారణంగా హిట్లరుకు ధారాదత్తంఅయే సమయానికి ఈ "ఫ్రాన్సు పతనం" వెలువరించిన సంపాదకులను అభినందించక తప్పదు. ఇండియాలో మరియేయితర దేశీయ భాషలోనూ యిట్టువంటి గ్రంథం యింతవరకూ రాలేదు. తొలుదొల్త ఫ్రాన్సు సంగతి సవిస్తరంగా తెలిసికొనడానికి ఆంధ్రులకు అవకాశం ఏర్పడింది.

" చీనా, రష్యా, బ్రిటన్ దేశాలు ఎలా శత్రువును నిర్జించగల్గుతున్నవి మన మాకళించటం ఎంత సబబూ, ముఖ్యమో అలాగే పరాభూతదేశాలు యెందువల్ల పడిపోయినది, వాటి జాడ్యపులక్షణా లెటువంటివి అనే సంగతులు ఈ సంకులసమయంలో మనం గ్రహించటమున్నూ అవసరమై యున్నది. ఈ గ్రంథం ఈ అవసరాన్ని తీర్చుచున్నది. ఇందులో పూర్వాపరాలన్నీ కూలంకషంగా చర్చించబడి పర్యవసానాలు తేల్చబడినవి. క్రమేణా ఫ్రాన్సు స్వతంత్ర్యజీవిగా ఉండక సామ్రాజ్యకామి అవటం, ౧౮౭౦ లో జరిగినయుద్ధం, తదనంతరపరిస్థితులు, ప్రపంచంలో ఫాసిజమ్ తలెత్తటం, ఫ్రాన్స్‌లోకలిగిన బహువిధమైన సంచలనం, సంఘీభావానికి జరిగినయత్నాలు, వాటి పరాజయం, ఇప్పటి యుద్ధవేళకున్న సందర్భాలు, రాజ్యపాలకు లెటువంటివారో, దేశంలో ఏర్పడ్డచీలికలు, కలిగిన గందరగోళం, ఫ్రాన్సుపరాజయం, ఫ్రాన్సుయొక్క భవితవ్యం—యివన్నీ యిందులో వివరింపబడినవి.

మనకివన్ని తెలిసేనిమిత్తం యీఅనువాదం చేసినవారు, గ్రంథం ప్రచురించినవారు ప్రశంసింపదగినవారు." —భారతి, మే 1942.

---

Printed at the Vanamali Press, 10, Subramania Mudaly St.,
Vepery, Madras.

25/9

## మా ప్రచురణలు దొరికేచోట్లు—

ఒంగోలు— శ్రీ ఇనికెళ్ళ ఆంజనేయులుగారు.

వేటపాలెం— శ్రీ అడుసుపల్లి శ్రీనివాసరావుగారు.

తెనాలి— శ్రీ యస్. యన్. రాయ్‌గారు, లక్ష్మీవిలాస్, గాంధీ చౌక్.

శ్రీ డి. వి. సుబ్బారావుగారు, వెన్నకొట్టు, మారిస్ పేట.

గుంటూరు— శ్రీ మాడభూషి శేషాచార్లుగారు, బ్రాడీపేట.

మంచికలపూడి— శ్రీ కొండపనేని బలరామకృష్ణయ్యగారు.

పెదవడ్లపూడి— డాక్టర్ కె. వి. శర్మగారు.

బెజవాడ— పాపులర్ ప్రింటర్స్, గవర్నరుపేట.

ది మాడరన్ న్యూస్ ఏజన్సీ, గవర్నరుపేట.

ది వెరైటీ ఏజన్సీస్, గవర్నరుపేట.

తెలప్రోలు— శ్రీ తుమ్మల వెంకటసుబ్బయ్యగారు.

నిడదవోలు— 'విజ్ఞానం' ఆఫీసు,

విశాఖపట్నం— ది సిటి న్యూస్ ఏజన్సీ.

అనంతపురం— నవ్యసాహిత్యమాల.

హిగిన్‌బాథమ్స్‌వారి రైల్వే పుస్తకశాలలన్నిటిలోను, వెంకట్రామా అండు కో, ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెని బ్రాంచీలన్నిటిలోను మా ప్రచురణములు దొరకును. (ఆంధ్రదేశమంతట ఏజంట్లు కావాలి. షరతులకు వ్రాయండి.)

## మా ప్రచురణలు

(వెలువడినవి)

1. సోవియట్ల దేశం
అనువాదం : శశి — ఫిబ్రవరి, 1942

2. ఫ్రాన్స్ పతనం
అనుసరణ : కామ్రేడ్ కుమ్మల — ఏప్రిల్, 1942

3. నేటి జపాన్
రచన : శ్రీ కొత్తపల్లి సుబ్బరామయ్య — జూన్, 1942

(త్వరలో వెలువడనున్నవి)

4. సోవియట్ రష్యా
రచన : శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ
అనువాదం : శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు, బి.ఏ.

5 మహమ్మదీయ జాతీయవికాసం
రచన : శ్రీ కాశీపట్నం కొండయ్య, ఎం. ఎస్సి.

6. నేటి చైనా
రచన : శ్రీ పింగళి పరశురామయ్య.

7. జపాన్ సామ్రాజ్యకాంక్ష
రచన : ? ? ?

8. నాజీ శ్రేణులవెనుక
అనుసరణ : సేవక్.